# కాంతిచక్రాలు

(ఖండకావ్యము)

ఉండేల మాలకొండారెడ్డి బి.ఇ.

ప్రథమ ముద్రణ:
వేయి ప్రతులు.

వైశాఖ పూర్ణిమ
1959



వెల రు. 1-50 న.పై.

ప్రతులకు:

రచయిత
3-8-863
బరకత్‌పురా, హైదరాబాదు.

క్వాలిటీ పబ్లిషర్సు
విజయవాడ-2

ముద్రణ:
సాధనా ప్రింటర్సు
హైదరాబాదు.

# అంకితము

పూజ్యులు, సాహితీ బంధువులు

శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారికి.



భారతి ముంగిటి అలం
కారము లివి "కాంతి చక్ర" కాండమ్ములు, శృం
గారించెద నీ కీర్తి
శ్రీరమణికి నేడు ప్రేమచిహ్నమ్ములుగా.

సిద్ధపఱచితి నీకు ప్రాంచిత సువర్ణ
ఘంటికా కీర్ణ "కాంతి చక్రాల" రథము,
పయనమొనరింపుమా, రసధ్వనులు సెలఁగ
వివిధ మధుర భావాంబరవీథులందు.

లేడు చళుక్యభూవిభుడు, లే డనవేముడు, కృష్ణరాయడున్
లేడు, కళాభిమానులగు ఱేడుల జాడలు కానరాని యీ
నాడు తెలుంగుశారద, కనాథకు ఆశ్రయమిచ్చి, జాళువా
మేడలు కట్టు నీకు ప్రణమిల్లెద రెల్లరు సాహితీపరుల్.

ఒక్కొకపాత్రనే మలచి యూపిరిపోసి, నటింపఁజేయుచున్
తిక్కన, పైడిగంటమున తీర్చిన భారత దృశ్యకల్పనా
శక్తికి నక్కజంపడి సెబాసని సారెకుమెచ్చు నీ సుధా
వాక్కులె నీ రసజ్ఞతకు వ్యాఖ్యలు నిక్కముగా కళాప్రియా !

నీ "కవిత్రయ జయంతి" కి సమాహూతులు
నిఖిలాంధ్రభువిని పండితులు కవులు,

నీ "సుదర్శనమహల్" నిలయమ్మ వాక్సతీ
కంకణ మధుర నిక్వాణములరు,

నీ పాత్ర దాతృత్వ నియమ గ్రంథమ్ములో
"లదు" యటన్న రెండక్షరములు,

నీ కేళికోద్యాన నిర్గత వాయువుల్
గాంధి సిద్ధాంత సుగంధిలములు.

సింహనగరమ్ములో "మన్మసిద్ధి" లేని
కొఱతదీర్చెడు కవికల్పతరువు నీవు
అట్టి నిను వల్లభునిగ చేపట్టుకతన
ధన్యయయ్యె నాకబ్బంపు తలిరుబోడి.





కృతిస్వామి

శ్రీ తిక్కవరపు రామిరెడ్డి

# పరామర్శ

శ్రీ పల్లంపల్లి సోమశేఖరశర్మగారు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.

'కాంతిచక్రాలు' అను ఈ చిన్న పొత్తమునందలి రచనలన్నియు ఖండ కావ్యములు. వీనిలో పద్యములును, గేయములు కూడ నున్నవి. వీనిరచయిత శ్రీ ఉండేల మాలకొండారెడ్డిగారు. విచిత్ర మేమనగ, వీరు ఇంజనీరింగు కళాశాలలో ఉపన్యాసకులుగా నుండియు స్వారస్యమైన తెలుగు కవిత్వమును చెప్పగలుగుటయే. వాస్తవమునకు ఇంజనీరింగు విద్యకు, తెలుగు కవిత్వమునకు చుక్కెదురు. ఏమాత్రమును పోలికలేని విద్యలవి; తత్త్వతః విభిన్నములైనవి. అట్టి సందర్భములో శ్రీ రెడ్డిగారిని కవితాకళ ఎట్లు వరించినదో తెలియదు. అయితే వేరు వేరు వృత్తులలో నున్నవారిలో ఏ కొలదిమందియో తెలుగుమీద అభిమానము కలిగి తెలుగున రచనలు చేయు సాహితీ పరులున్నారు; ఏదో కొద్దిగనో గొప్పగనో తెలుగులో కవిత్వము చెప్పువారు నున్నారు. కాని శ్రీ రెడ్డిగారి కవిత్వమట్టిదికాదు. వారు శబ్దశక్తి నెరిగిన ధీమంతులు. ఏ శబ్ద మెట్లు ఎచ్చట ప్రయోగించిన రసవ్యంజకముగ నుండునో తెలిసిన ప్రోడలు. కవిత్వము ననుసరించి చూచినచో వారు నవీనులలో ప్రాచీన కవుల పంథాకు చెందినవారు. కాని భావ శబలత, రూపకల్పనము, ఉపమించుటలో గల నేర్పు మొదలైన మేలిగుణముల ననుసరించి చూచినచో వారి కావ్యములు ప్రాచీనములలో నవీనములు; అవి నవ్యతాముద్రను సంతరించుకొని పాఠకహృదయము నలరింపజేయుచుండును. ఈ కవితా సంపద వారి పూర్వపుణ్య పరిలబ్ధము.

శ్రీ మాలకొండారెడ్డిగారు ఇదివరకే విరచించిన శ్రీ వివేకానందాది సత్కావ్యములవల్ల లబ్ధప్రతిష్ఠులు; ఆంధ్ర సాహితీ పాఠక

లోకమునకు శ్రుతపూర్వులు; కృతపరిచయులు. అట్లగుట ఈ "కాంతి చక్రముల" కొరకు ప్రత్యేకముగ పరిచయ వాక్యములు వ్రాయుట యనావశ్యకము. అయినను దీనికి ఆశీః పూర్వకముగ తొలి పలుకు వ్రాయుడని వారు నన్ను కోరుట వారికి నామీదగల గౌరవాభిమానముల వలననే.

ఈనాడు రాజ్యములు కూలిపోయినవి; రాజులంతరించినారు. ఆ స్థానము లంతరించినవి. కళల నాదరింపవలసిన భారమును, బాధ్యతయు సామాన్య జనముపై బడినది. సామాన్య జనులకు జీవనోపాధి వెదకి కొనుటతోనే వారి కాలము సరిపోవుచున్నది. ఈ కారణమున సాహిత్యమన్న గొప్ప యభిమానము గలవారికైనను పెద్ద కావ్యములు చదువుట కవకాశము లేదు. ఈ రీతిని నేటిది పెద్ద కావ్యముల కనువైన యుగము కాదు. నేడు కథలు, నాటికల తరువాత ఇంకను కొద్దిగనో గొప్పగనో గేయమైన నేమి, పద్యఖండిక యైన నేమి ఖండకావ్యమునకే కొంత యాదరమున్నది.

ఇటీవల నవ్యాంధ్రసాహితీ నందనవనమున పేరు పెంపులు గాంచి వాసికెక్కినది ఖండకావ్యము. ఆంగ్ల వాఙ్మయ పరిచయము కారణముగ తెలుగువారికి లభించిన సుధామధురఖండమిది. నేడు ఖండకావ్యరచనమునకు ప్రకృతి యందలి ప్రతివిషయమును కవికి ఉచిత వస్తువే. నవ్యాంధ్రకవి యల్పవిషయములలో సైతము తన యుదాత్తాంతరంగిక భావనాసృష్టివలన, మహత్తును స్ఫురింపగలుగుచున్నాడు. కవి కావ్యవీథికెక్కి శాద్వలస్థలమునందలి గడ్డి పూవు, చిగురుటాకు మీద నెలకొను మంచుకణము, రంగు రంగుల నీలి ఇంద్రధనుస్సు, తుగకాకాశమున నెగిరిపోయెడు విహంగము, కష్టించి పని చేయు కష్టజీవి-ఈ విషయమూ విషయమననేల చరాచర ప్రపంచమునందలి ప్రతి వస్తువు ఏవియో నవ్యనూతన భావ కాంతిరేఖలు విరజిమ్మును; ఏదియో యొక యపూర్వ సందేశమును వినిపించును.

ఇటీవల తెలుగులో ఖండకావ్య గుచ్ఛములనేకము వచ్చు చున్నవి. అట్టివానిలో ప్రశస్త కృతుల కోవకుచెందినది ఈ 'కాంతి చక్రాలు'. ప్రశస్త ఖండకావ్య రచయితలైన యుపసత్కవులలో శ్రీ మాలకొండారెడ్డిగారికి సముచితోన్నత స్థానము కలదు. గొప్ప కావ్యములను రచియించుటలో వీరికెంత కౌశలమున్నదో ఖండ కావ్యరచనలోను, గేయరచనలోను గూడ నంత నైపుణ్యము కలదు. భావనాపటిమ, అర్థగౌరవము, పదముల లాలిత్యము, ఉపమాన ముల సొంపు, అలంకారముల సొబగు, సమాస గ్రథనములోని కౌశ లము, శైలీమాధుర్యము, పద్యముల ధారాశుద్ధి,—ఇవి వీరి పద్యము లలో గానవచ్చు గుణశేషములు. యతి ప్రాసలకొరకు వ్యర్థ పద ములనేరి తెచ్చుకొను ప్రాకులాట వీరెరుగరు. వీరిది పద్యరచనలో వలెనే గేయరచనలోను అందెవేసిన చేయి.

ఈ చిన్ని పొత్తమునకు అలంకార ప్రాయములైన ఖండకావ్య ములు, గేయములు పెక్కులున్నవి. ఇవి యొకదానికొకటి యేవిధమునను తీసిపోనివి. అయినను 'కాంతిచక్రాలు' మిన్న యను కొందును. కృతికర్తయభిప్రాయము నదియే యేమొ. ఈ కారణ మున నే కావచ్చు నేతత్కృతికర్త ఈ పద్య గేయ సంపుటికి 'కాంతి చక్రా'లని పేరిడినాడు. 'కాంతిచక్రాలు' ఆంధ్రపురంధ్రీమణుల హస్తముల నలంకరించు వట్టిగాజులే. కాని యవి కవిరసవత్కవి తాధారా ప్రక్షాళితములై పాఠక హృదయమును పల్లవింపజేయు అపూర్వశోభాసముదీర్ణములైన కాంతిచక్రాలేయైనవి. కవి గాజుల సెటియై చెప్పుచున్న ఈ క్రింది పద్యమెంత మనోహరముగ నున్నదో చూడుడు:

"సీతమ్మ ముంజేయి చెందమ్మి మొగ్గకు,
కింజల్కముల నతికించినాడ
తరుణవిద్యార్థినీ కరశాఖికాశిఖల్
వంచి క్రొంజివురాకు లుంచినాడ

"ధూమవేణి" మన మనుదినము చూచుచున్న పొగబండియే; చూచుట కది వింత చెలువము చిలుకరించు నవలాకాంతమా, తన శోభతోను, పరిమళముతోను మన మనస్సు నలరించు గులాబిపుష్పమా- ఏమంత యందమైనదని. కాని యది ఈ కవికి మధురాతి మధురమైన కావ్య వస్తువయినది. ఈ కావ్యమునందలి పద్యములు చదివినకొద్ది చవులూరుచుండును. ఈ కవి పట్టిన వస్తువెల్ల బంగారమైనది. అతడు సొన్నారి. శిల్పమతని సొత్తు. ఇక నతని రచనలు భూషణములు, బుధతోషణములు కాక మరేమగును? ఇంకను ఉదాహరణముల నీయవలెనను చాపలమున్నను సహృదయులైన సాహితీపరులే స్వయముగా చదివి కావ్యరసాస్వాదనము చేయుటకు వాని నీయనైతిని.

శ్రీ మూలకొండా రెడ్డిగారు ఇంకను రసవత్కావ్యములు రచించి భాషామతల్లి నారాధించి కీర్తినార్జించి వర్ధిల్లుదురు గాతమని ఆశీర్వదించుచున్నాను.



# పరిచయము

## డా॥ దివాకర్ల వేంకటావధానిగారు. M.A.Ph.D.

### ఉస్మానియా విశ్వవిద్యాలయము. 29-9-59

శ్రీ చి. ఉండేల మాలకొండారెడ్డిగారు వయస్సునం జిన్నలైనను గవితా పాటవమున మిన్నలైన సరస కవివతంసులు. చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాఁడే వారు నేతాజీ, వివేకానందుఁడు అను రెండు కావ్యములు రచించి పెద్దల మన్ననను పొందఁజాలినారు. విద్యాభ్యాసము ముగించి యుద్యోగ వశమున హైదరాబాదున కరుదెంచిన పిమ్మట నిచ్చట జరుగు బహు కవిసమ్మేళనములలో నుత్సాహమునం బాల్గొనుచు వారు యువకవివతంసులలో నున్నత స్థానమును వహించి మించినారు. అందుచే వారినిగాని వారి కావ్య సంతానమునుగాని వేఱుగాఁ బరిచయము చేయవలసిన యవసరము లేదు. మఱి యీ యనవసరమైన పనిని నేనేల చేయుచున్నాననఁగా సవినయముగా వారు కోరిన కోరిక పూరింపకుండుట సాధ్యము కామిచేత.

"క్రాంతి చక్రాలు" అను నీ ఖండకావ్య సంపుటము విశాలాంధ్ర మవతరించిన పిమ్మట శ్రీ రెడ్డిగారెడనెడ రచించిన రసవత్తరములైన కొన్ని ఖండకావ్యముల సముచ్చయము. ఇందలి ఖండకావ్యములలో క్రాంతిచక్రాలను శీర్షిక కలదియు నొకటి కలదు. క్రాంతి చక్రములనగా సీమంతినీలలామలు కన్నెమిన్నలు మాంగళ్యమునకును మహిత సౌందర్యమునకును చిహ్నములుగా ముంజేతుల ధరించు రంగు రంగుల కాచవలయములు. ప్రముఖమైన ఖండకావ్యము పేరు కావ్య సంపుటమునకంతకును బెట్టు నాచారము ననుసరించియు, నాపేరన్ని ఖండకావ్యములకును అన్వయించుట కవకాశముండుట నూహించియుఁ గవిగారు వివిధ భావపూరితయు నానా గుణ విరాజితయు నగునీ తమ ముద్దుఁగూఁతునకా నామకరణము చేసినారు. నిజమునకిందలి యొక్కొక్క ఖండకావ్య మొక్కొక్క ప్రతిభా కాంతి

చక్రము. చదువుట కుపక్రమించినది మొదలు ముగించువఱకుఁ దత్కాంతి సంతతులచే పఠితల హృదంతరములు దంతురితములై యమందమైన యాలోకానందమున నోలలాడుననుటలో నత్యుక్తి లేదు.

ఈ సంపుటమునందలి పూర్వార్ధమునఁగల ఖండకావ్యము లన్నియుఁ బద్యాత్మకములు; ఉత్తరార్ధమునందలివి గేయాత్మకములు. బహిరావరణమున నించుక భేదమున్నను ప్రౌఢము రసవంతమునైన యంతరమున మాత్రము వీనికంతగా నంతరములేదు. అన్నియు నుదాత్తములైన భావములకును, మనోహరములైన వర్ణనములకును, నిర్దుష్టమైన రచనా పాటవమునకును నిలయములై యానందము నావహించుచున్నవి. పద్యగేయాత్మకములైన రెండు రీతులలో, పూర్వాధునికములైన రెండుమార్గములలోఁ గవిగారికిఁగల యభిమానమునకును అభినివేశమునకును ఈ ఖండ కావ్య సంపుటము తార్కాణముగా నున్నది. ఇటీవల వెలువడిన ఖండ కావ్య సంపుటములలో నిట్లామూలాగ్రము రసమయములై సహృదయ హృదయావర్జకములు కాఁజాలునవెన్నో లేవు. ఆ యున్నవానిలో నైతమిది యుత్తమశ్రేణి నందునని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

ఇందలి ఖండకావ్యములలోఁ గొన్ని దేశభక్తి ప్రేరితములైనవి; కొన్ని వర్ణనాత్మకములైనవి; కొన్ని యాధునిక విజ్ఞాన శాస్త్రమునకు సంబంధించినవి; కొన్ని శోభన గర్భములైనవి; కొన్ని పెద్దలయెడఁ గవిగారికిఁగల భక్తిగౌరవములను ప్రదర్శించునవి. ఈ విధముగా గవిగారు గ్రహించిన వస్తువులలో వైవిధ్యమున్నది. ఏ వస్తువును గ్రహించినను వారు దాని సమగ్ర స్వరూపమును భావన చేసి, యుచిత పదభావ సంపదచే దానికొక దివ్యమైన యాకారము నొసంగి సహృదయులకు సాక్షాత్కరింపఁ జేయుదురు. భావముల నుదాత్త సుందరములుగా నూహించుట, ఊహించిన భావముల నౌచిత్యభాసురముగా వ్యక్తము చేయుట అను కార్యములలోఁ

కవిగారికిఁగల కౌశలము ప్రతి ఖండకావ్యమునందును గోచరించును. వారి వర్ణనములు సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనమున కునికిపట్టులు. వస్తువును వివిధ కోణములనుండి పరిశీలించి తదాకార శబలతను వారెంతో చమత్కారముగా, సౌష్ఠవాంచితముగా సరిదిద్ది సహృదయుల కందఁజేయుదురు. అనవద్యసుందరమైన యాకారమును గాంచి సహృదయు లానందింపకుందురా?

మహాంధ్రావతరణము, కృష్ణవేణి అను ఖండకావ్యములు కవిగారి యాంధ్రాభిమానమునకు నిదానములు. కాళిదాసస్మృతి యిందు రెండుగుచ్ఛములలోనున్నది. ఈ రెంటియం దామహాకవి కావ్యములన్నిటితోఁ గవిగారికిఁగల పరిచయము పెక్కుచోట్ల వ్యక్తమగుచున్నది. కాళిదాసెంతో గొప్పకవి. ఆతడు తలఁచిన దేనినైన నేమినైనఁ జేయఁజాలును. అంతవాఁడయ్యునతఁడు "అందని ఫలమ్ముకొఱకయి ఆసచేయు చిట్టి మఱుగుజ్జునే"నని చెప్పి యపూర్వమైన వినయమును బ్రదర్శించినాఁడు. కవిగారి నామహాకవి కావ్యము లందలి సౌందర్యమువలె ఈ వినయవిశేషమును అధికముగా నాకర్షించినది. వినయ గుణసంపదయందు వారికిఁగల యాదరమట్టిది. "కాంతిచక్రాల"లోని భావములెంతో హృద్యములు. కళలు నేర్చిన కలకంఠులు వివిధమాసముల మనసఁగందఁజేయు పసందునకును రసస్ఫూర్తికిని "మలారములోఁ గొంచెు నవ్వునవ్వు గాజుల సరాల మధుర నిక్వణములే" కారణములఁట! "గాజులొలిచివేసి గడియారమునుగట్టి, తిరుగు బస్తీపడుచు" చిన్నిచేయి, కాంతిచక్రములు లేమిచే శిశిరశీతవాత శిథిల పత్రిక వలెఁ జిన్నబోవుచున్నదని కవిగారు ఖిన్నులగుచున్నారు. నిజమునకుఁ బూర్వుల యలంకారవిధానములలోఁ బలురకముల యందచందము లిమిడియున్నవి. కాలనాగరికతా ప్రభావముచే నవి యొక్కొక్కటే విస్మరింపఁబడిపోవుట సౌందర్యపిపాసువుల కెల్లరకును సంతాపకరమే యగుచున్నది. "కోడి ముత్తయిదువు"లో క్షుద్రమైన యాపక్షి కవిగారి ప్రతిభా మహిమచే క్షుద్రలోహములు రసవాద విద్యచేవలె బంగారు

ప్రతిమయైనది, ఆయనదృష్టి కాయాసందర్భములందు పుంజుకోడు కన్నునివలెను, కోడిముత్తైదువు గెల్చిన ఝాన్సిరాణివలెను గానిపించినవి. వారి నాకర్షించిన కుక్కుట గుణగణ సంపదలలో ఋతుబద్ధ రాగ భోగోన్నతి యొక్కటి. ప్రతి ఋతువును వసంతముగా భావించు నీ కవికుమారు నీగుణమాకర్షించుట నాకు వింతగొల్పినది.

వస్త్రశిల్పిలో నిర్జీవ యంత్రములు జీవయంత్రముల నడఁచి వేయు చున్నందుకు మిక్కిలి వగచినారు. "కాగితపుఁ బూలపై వ్రాలు కందిరీగ పద్మగంధమ్ము మెచ్చునే"యని వారుచేసిన గూఢమైన హేళన యాంధ్రులనందఱి నొక్కుమ్మడి చేనేత వస్త్రముల దుకాణములకుఁబంపఁజాలునంత బలముగలిగియున్నది. రేడియో వారి శాస్త్రవిజ్ఞానమునకునిదర్శనము. నీరసమైన యా శాస్త్ర నిర్మాణము వారిచేత నవరస మూర్తియైనది. నందనోద్యాన మందున కల్పతరు శాఖచెక్కి నీ తనువు సృష్టించినా"రను సీసమునందలి క్రమాలంకార మతిమనోహరముగానున్నది. ధూమశకటియందలి వర్ణనలు మిక్కిలి సహజములుగానున్నవి. "కాచుకోరా! అలెగ్జాండరూ" అన్న సీస పద్యము కవిగారికిఁ బూర్వ భారతీయ వీరులపైఁగల యభిమానము ననేక విధముల వెల్లడిచేయుచున్నది. "బ్రతుకు రైలుబండి పయనము. దానిని ధర్మపథమునుండి తలఁగనీ"వలదని కవిగారి ప్రార్థన. ఇట్టి ధర్మనిష్ఠగల యువకవుల సంఖ్య పెరిఁగినకొలది దేశ సౌభాగ్య మతిశయించునని నా యాశ.

కవికోకిల, బాపుజీ అను ఖండకావ్యములు కరుణరస నిధానములు. కవిగారికా కవిచంద్రునియెడను, నాయకమణి యెడనుగల యపారమైనభక్తి యా పద్యములలో నుప్పొంగుచున్నది. నిద్ర, హిమము అను ఖండకావ్యములు కవిగారి వర్ణన పాటవమునకుఁ దార్కాణములు, గ్రుడ్డికొంగ, కడలికావరము చక్కని హేళన

కావ్యములు. గేయకావ్యములలోని భావములు నూతనములును భావోద్రేచకములునై యపూర్వమైన యాహ్లాదమును జూఱ యిచ్చు చున్నవి.

ఈ కవికుమారుని శైలినిగూర్చి రెండు మాటలుచెప్పి యింక విరమించెదను. ఈ కావ్యములన్నింటఁ బదప్రయోగము నిర్దుష్టమును, ఔచిత్యవంతమునై యెంతో మధురముగా నున్నది. భావ గాంభీర్యమును బదసౌష్ఠవమును ఇంతపొత్తు వహించుట యిప్పటి కావ్య సంతానములలో నెచ్చటనో కాని కాన్పింపదు. సమాసాడంబరము లేని మృదుమధుర జాతీయ పదముల పొందిక యన్ని కావ్యములకు నపూర్వమైన యందమును జేకూర్చుచున్నది. పెక్కుచోట్ల సౌకుమార్యమునసే ఓహో యనిపించు ప్రౌఢత ప్రత్యక్షమగుచున్నది. "హిమ వృష్టి లేకున్న విమల భాగీరథీ నదికి సైతము జీవనమ్ము లేదు" "ఒఱగుదిండులు పట్టుపఱుపులేకాని భోగులులేని యద్దాల చలువగదులు" "నీ ఉపమారుచి నిచ్చలు మెచ్చుచు భుజియించి త్రేన్చని భోక్తయేడి" అను పద్యములలోని జీవనమ్ము, భోగులు,( ఉవమా అను పదముల ప్రయోగములోని చమత్కారమిందుకు దృష్టాంతము, "దరహాసకాంతి వెల్లువిర్చెను నీ కనీనికల అనుట ఆంధ్ర కవితా పితామహుని పద్యమును దలఁపునకుఁ దార్చుచున్నది. వడగండ్లను వర్ణించుచు "మీబట్ట పుఱ్ఱెలకు కడగండ్లూ" అనుట సహృదయులైనచో బట్టతలలున్నవారినిగూడఁ బక్కున నవ్వింపక మానదు. ఈఖండకావ్యములలోనియుపమానములెంతో రమ్యములుగా నున్నవి. అన్నిటికన్న నన్నెక్కువగా నాకర్షించినది దేశదేశాలు తిరిగి పొగలు వదలుచువచ్చు రైలుబండి "పొలానఁ గష్టమ్ముచేసి చుట్ట కాల్చుచు నిలుచేరునట్టి రైతు"వలె నున్నదనుట, ఈ విధయుగా

నీ ఖండకావ్య సంపుటము భాషాభావములందును, రసరామణీయకము లందును, అందచందములందును అద్వితీయమై యానందము గొల్పుచున్నది. వదాన్య శేఖరులును, రసజ్ఞ నుహంసులునైన శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారి యభిమానము నాకర్షింపఁజాలుటయే యీసంపుటము నుత్కృష్టతను జెప్పక చెప్పుచున్నది. ఇందుల॰

ఎక్కడ చూచిన పక్కునవ్వే
మల్లెలు మొల్లలు మందారమ్ములు
పొన్నలు పొగడలు సన్నజాజులూ"

అట్లెత్తి చూచుచున్నట్లుండును. వాని యపూర్వ పరిమళముల నాస్వాదించి సహృదయులు రసపారవశ్యము నొందుదురుగాక. శ్రీమాల కొండారెడ్డిగారింకను ఉదాత్తములైన కావ్యములు సృష్టించి యీ ఖండ కావ్యముల రుచి నాస్వాదించి యువ్విళులూరుచుండు నాంధ్ర సహృదయ శేఖరులకు వింతయైన యామెత సంతరింతురుగాక.



# విజ్ఞప్తి

యాంత్రిక నాగరికతా సమ్మోహితమైన నేటి ప్రపంచం ప్రచండవేగంతో పరుగులిడుతూ ఉంది. యంత్ర ఝాంకారాలలో కవితా కలకూజితాలు మానవులకు విన్పిస్తున్నాయా లేదా అన్నది యీనాటి ప్రశ్న. విన్పించనినాడు యంత్ర స్రష్టయైన మేధావి యంత్రంగా మారిపోయే ప్రమాదం ఉంది. జీవన వ్యథా భారంతో అలసిపోయిన హృదయానికి అమృతస్నానం వంటిది కవిత. అందుకే,

సంసార విషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సల్లాపః సజ్జనైస్సహ.

అన్నారు ప్రాజ్ఞులు. స్థూలంగా, చెప్పాలంటే మానవులలోని మానవత్వాన్ని చిగురింపజేయునదే కవిత. ప్రకృతి పుటలువిప్పి, అందలి నీతి సందేశాక్షరాలను తన భావనా దర్పణ సాహాయ్యంతో సహృదయుల హృదయచక్షువులకు ప్రత్యక్షపఱచుటే కవి లక్ష్యముగా ఉండాలని నా విశ్వాసం. నాలో ఆవేశం ఉరకలు వేసినపుడు మనఃస్ఫటికంపై ఊహా కిరణాలు ప్రతిఫలించినపుడు ఉదయించిన ఇంద్ర ధనుఃకాంతులే "కాంతిచక్రాలు"గా రూపొందినయ్. రసజ్ఞులిందలి సౌందర్యరేఖల్ని మాత్రమే దర్శించి నా చాపల్యమును మన్నిస్తారని ఆశిస్తున్నాను.

ఈ ఖండకృతులు చాలవరకు ఆకాశవాణిద్వారా, భారతి మున్నగు పత్రికల ద్వారా ప్రజలకు పరిచయమైనట్టివే. 1958 సంవత్సరము మేనెలలో నెల్లూరులో మాన్య శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు ఏర్పాటు చేయించిన కవితాగోష్ఠిలో కొన్ని ఖండకృతులను విన్పించడం జరిగింది. రసజ్ఞ శేఖరులైన శ్రీ రెడ్డిగారు ఈ కృతులందలి ఔచిత్య

లేశానికి హర్షించి, వీనిని ముద్రింపవలసిందని ఆదేశించారు. 1959వ సంవత్సరము మార్చి నెలలో జరిగిన కవిత్రయ జయంతుల సందర్భమున ఎఱ్ఱాప్రెగ్గడ జయంతికి నన్ను ఉపన్యాసకునిగాపిలిపించి, వారి సతీమణి స్వర్గీయ శ్రీమతి సుదర్శనమ్మగారి పేర నన్ను సన్మానించారు. అంతేకాక బాల్యంనుండి నాపై అవ్యాజానురాగము చూపుతూ ఉన్న ప్రేమ హృదయులువారు. వారియందు నాకుగల గౌరవాతిశయ మునకు చిహ్నంగా ఈ కృతిని వారికి అంకితమిస్తున్నాను. మహా కావ్యముల నెన్నిటినో ముద్రించి కృతిగొన్న శ్రీ రెడ్డిగారు ఈ నా చిన్నికావ్యానికి కృతిస్వామిగా ఉండుటకు అంగీకరించడం నా భాగ్య విశేషంగా భావిస్తున్నాను.

ఈ కావ్యానికి కోరినంతనే పరిచయము వ్రాసిన విద్వత్కవి శేఖరులైన శ్రీ దివాకర్ల వెంకటావధానిగారికి పరామర్శచేసిన సుప్ర సిద్ధ చారిత్రక పరిశోధకులు, రసజ్ఞులునైన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి నాహృదయపూర్వక నమోవాకములర్పిస్తున్నాను.చక్కని ముఖచిత్రము వ్రాసియిచ్చిన శ్రీ మడిపడగ బలరామాచార్యులకు పుస్తకమును నిర్దుష్టముగా ముద్రించుటలో సహకరించిన శ్రీ చక్రవర్తి రంగస్వామిగారికిని, గ్రంథ ప్రచురణ విషయములో తగు సలహాల నిచ్చిన డా॥ బి. రామరాజుగారికిని, ఇతర మిత్రులకును నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

హైద్రాబాదు
4-5-59

రచయిత



# కావ్యసూచిక

## మహాంధ్రావతరణము

శ్రీరాముల పూర్ణాహుతి
ధీరాంధ్రుల కార్యదీక్ష తెలిసెను, ఢిల్లీ
రారాజుల, కీనాటికి
భారతమందార మమృతఫలముల వెలసెన్.

ముప్పదియేండ్ల దీర్ఘనిశిపోయె, జగాన నవారుణద్యుతుల్
గప్పె. సువర్ణ ఘంటలు ఘణంఘణ మోగె, వియత్
పథమ్మునం
దొప్పులకుప్పయై కదలుచుండె మహాంధ్ర రథమ్ము,
రమ్ము. నీ
కప్పురపున్నివాళులను గైకొని, ఆంధ్రసువాసినీమణీ !

వీరుఁడు కృష్ణరాయపృథివీపతి మౌళిధరించికొల్వుఁ జె
ల్వారి, శతఘ్నివందన సహస్రములందిన తెల్గు బావుటా
సారతర ప్రతిష్ఠఁగనఁ జాలితిమిప్డు " నిజాము " కోటలో
భారతమంత్రిమౌళి ప్రియవాక్కులలో జయశబ్దఘోషలో.



త్యాగయ్య మధుర సుధామయ గీతికల్
దక్షిణోర్వికి గానభిక్ష పెట్టి,
జీర్ణ హంపీ కుడ్య శిల్ప లావణ్యమ్ము
గతచరిత్రల జయాంకములు దెలుప,
గౌతమీ కృష్ణా మహోతరంగచ్ఛటల్
నవ్యాంధ్ర యశము గానమ్ము సేయ,
రత్నగర్భిత సస్యరమ్య " విశాలాంధ్ర "
మమర ధేనువు వోలె నండ నిలువ,
మూడు దెసలనున్న ముక్కోటి తెలుఁగులు
కలిసివచ్చి, క్రొత్త కడప ద్రొక్కి
కాపురమ్ము సేయఁ గడఁగు నీశుభవేళ
చరిత కొక్క స్వర్ణ శకముగాదె !

మగధ రాజ్యేందిర సొగసుపైఁ గనుగీటు
శాతవాహనుని దర్పాతిశయము
ఉదయాద్రి శిలఁదాకి, యోఢ్రమ్ముపై దూకి
పఱతెంచు రాయల మెఱపు దాడి,

ప్రాజ్య సామ్రాజ్య నిర్మాణ దక్షంబైన
మంత్రి తిమ్మరుసు ధీమహితశక్తి
సంఘ శార్దూల దంష్ట్రిలతోడఁ జెలగాడు
"వీరేశలింగ" సంస్కార పటిమ
చెదరనీయక, నీలోనఁ బదిలపఱచి
శాంతి సౌభాగ్య లక్ష్మీ ప్రసన్న గతుల
నొడుదుడుకులేక రాజ్యమ్ము నడపు కొనుము
దేశదేశాలు వినుతింపఁ దెలుగుఁదల్లి !

(1-11-1956)



# కృష్ణవేణి

ఎంత సుమధురగాత్రివే కృష్ణవేణీ ! నీ
వెవరికొఱకై పరుగులిడెదవే పసిఁబూని
నీవు నిలిచిన తావు నేలపై స్వర్గమే
నీవు తాకినదెల్ల నిత్య శీతలమౌనె
ఆంధ్రయువకులు నీకు స్వాగతమ్మిత్తురే
పల్లెపడుచులు పసుపు పారాణి యిడుదురే
కడలిరాయని రేపు కలిసి కొందువు గాని
అతిథివై మాయింట ఆగవే యీ పూట.

హోరున మ్రోతలెత్తుచు మహోన్నత శైలశిలా తలమ్ములన్
జారి, ధరిత్రిపై దుమికి, నాఁటెపు వన్నెలు చిన్నెలద్ది, శృం
గార వనాంతరమ్ముల ఖగప్రతతుల్ శ్రుతిగల్పి పాడ, నో
య్యారముతోఁ జరించెద, వయారె ! సృజింతువు రమ్య దృశ్యముల్

నాగార్జునాచార్య నవనీత హృది నుండి
జారిన మత ధర్మ సార మధువు,
కాకతీయ నృపాల ఖడ్గ ధారాహత
పరిపంధి భామినీ బాష్ప జలము,
రాయల అంతఃపుర స్త్రీల జలకంపుఁ
బన్నీటి జల్లుల పరిమళమ్ము,
పలనాటి బాలుని పచ్చల పిడిబాకు
గ్రుచ్చి, చిమ్మిన వైరి గుండె నెత్రు,
అన్ని, నీలోన జీర్ణమై చన్న కథలు
నీ తరంగాలలోన విన్పింపసాగె
ఏమెఱుఁగనట్లు పయనింతువేటికమ్మ !
కృష్ణవేణమ్మ ! మనవి యాలింపు మమ్మ !

నాగార్జున సాగరమై
ఆగుము పల్నాట, హర జటాటవిలోనన్
భాగీరథివలె; మెఱపుం
దీగెలు సృష్టింపు మవని దిగ్గెదు వేళన్



చంచలమైన నీమదికి స్థాయి ఘటించి, త్రిలింగ భూమి నా
ల్గంచులకున్ వినీల విమలాంబు ఝరుల్ ప్రవహింపఁ
జేయ య
త్నించిరి కర్మసేన కదలించిరి, నవ్య భగీరథుల్: ప్రశాం
తించి, యనుగ్రహింపఁగదె తెల్గులకున్ చిర భాగ్య
దీపికల్

కండలు కందిపోవ, యువ కార్మికవీరు ల మండుటెండలోఁ,
గొండలు పిండి కొట్టి సమకూర్తురు నీకు నివాసమున్, గళా
ఖండము, నాంగ్లవాస్యపరికల్పిత దీర్ఘ బుభుక్ష దీర్పఁగాఁ
బండుగ సేయవే సుతుల పాలిటి తొల్లిటి అన్నపూర్ణవై

నీలో స్వచ్ఛతమ ప్రశాంత జలముల్ నిద్దంపుటద్దమ్ములై
నీలాకాశపుఁ జంద్ర తారకలతో నేస్తమ్ము పాటింపఁగా,
నాలో రేగిన భావముల్ హృదయ వీణాతంత్రులన్ మీటి, రా
గాలాపమ్మనఁబాడె భారత భవిష్యద్భాగ్య సందేశముల్



వేసంగి నిప్పుల వేఁగు పల్నాటికి
శైత్యోపచారమ్ము సంతరించి,
బౌద్ధ శిల్పుల కళా ప్రసవముల్ విచ్చిన
క్షేత్రమ్ములకుఁ బునర్జీవ మొసఁగి,
రాయలేలిన పూర్వ రత్నాల సీమకు
విద్యుల్లతారాశి విస్తరించి,
తేజోనిధానమా తెలఁగాణ పొలమున
సస్యలక్ష్మికి స్థిరాశ్రయము గూర్చి,
తెనుఁగు మాగాణమెల్ల నందనము సేయు
కీర్తి నీకొక్కతెకు దక్కె కృష్ణవేణి!
నీవిలాసమ్ము కావ్యలక్ష్మీవిహార
భాసురమ్మయ్యె, విశ్వసంభావ్యమయ్యె.



# కాళిదాసస్మృతి

అమర వాఙ్మయ రాజహర్మ్యమ్మునందు
కావ్యమణి దీప దీధితుల్ కడలు కొలిపి
విశ్వమోహన శోభఁ గల్పించి నట్టి
సరసహృద్యాన ! కాళిదాసా ! నమోస్తు !

కుప్పించి నందినీ గోవుపై దుమికిన
    మృగరాజు వికచ దంష్ట్రికల మెఱపు,
బాహు ప్రతిష్టంభ పరివృద్ధ కోపాగ్ని
    నాపుకోలేని దిలీపు ప్రతిమ,
పూవిల్తు నిల్వున బూది గావించిన
    అభ్రకేశుని కంటి యగ్ని కీల,
అల రతీదేవి దుఃఖాశ్రుపూరమ్ములోఁ
    బొగరాజు వలరాజు బూది ప్రోవు,



కట్టెదుటఁ గానుపించెడు కరణి, శబల
వర్ణకాంతులఁ జిత్రముల్ వ్రాసినావు
గంటమే రంగు కుంచియగా నొనర్చి,
క్రమ కవితా సమున్మేష ! కాళిదాస !

నీ స్వర్ణలేఖినీ నృత్యశాల నటింప
   అమర శారదకు ఒయ్యారమబ్బె,
నీవు సృష్టించిన నీరదగర్భకుఁ
   బ్రణయ సందేశ గౌరవము గలిగె,
నీ కళాశిఖరిపై నిలిచి, "శకుంతల"
   నిఖిల దిక్తట ప్రేక్షణీయమయ్యె,
నీవు శాసించిన నిర్ఝర సుందరి
   నరునితో నిలిచి కాపురముచేసె,
కూతునకుఁ దండ్రి కెడబాటుగూర్పనీవు,
చిన్ని తీగకుఁ గన్నులు చెమ్మగిల్లె,
ప్రకృతి నాడించు ఐంద్రజాలికుడ ! నీవు
గంట మూగింప వింతలు కలుగకున్నె !

నీ "ఉపమా" రుచి నిచ్చలు మెచ్చుచు
  భుజియించి త్రేన్చని భోక్తయేది ?
నీ "మేఘ" గంభీర నిర్ఘోషమున కులికి
  ధివుఁ గౌగిలింపని తరుణియేది ?
నీ కావ్యకన్యల నిత్య కోమల ముఖా
  బ్జములు చుంబింపని భ్రమరమేది ?
నీ దివ్యకృతి నందినీ ధేనువునకు వ
  త్సమ్ముగానట్టి రసజ్ఞుడేది ?
వాణి వాయించు మాణిక్య వీణలోని
తీవెపై నీవు మూర్ఛనల్ పోవునపుడు
పులకరింపని చిఱుగడ్డిపోచయేది ?
సద్యశోమూర్తి ! రసరాజ్యచక్రవర్తి !

మ్రోడువారిన హృదయాలు మోసులెత్త
అమృతమొలికించి, భారతీయాత్మతోడఁ
గలిసిపోయిన నీ దివ్యకావ్యవాణి
అమరభాషకు అమరత్వమబ్బఁజేసె.

ననల వ్రేగున వంగి నడచు తీవెయనంగ
    హరపూజకేతెంచు గిరిజవోలె,
నెపమిడి, దుష్యంత నృపుని వీక్షింప, వె
    న్దిరుగు శకుంతలా తరుణిలీల,
సఖి వెంటరా, దీపశిఖరీతి, నృపసభా
    మధ్యానఁ జను ఇందుమతి విధాన,
అల పురూరవుని దిగంబరుగా వెంటఁ
    బరుగులెత్తించు ఊర్వశి యనంగ,
ముగ్ధయై, ప్రౌఢయై, రసస్నిగ్ధ తరుణ
భావయై, సాగు నీ కవితా వధూటి
ప్రణయ దృక్కులఁ జిక్కని రసికుడేడి ?
కావ్యమణిమండపనివాస ! కాళిదాస !

తుంగ శృంగ మనోజ్ఞ తుహినాద్రిఁ బృథివికి
    మానదండమ్ముగా మలచినావు,
కిన్నర మిథునముల్ క్రీడించు గుహలకు
    నీలి మబ్బులతెరల్ నిలిపినావు,

వాగర్థశిల్పివై వాగర్థముల లీల
తొలియాలుమగలనే కలిపినావు,
అలకాపురములోని యక్షకాంతకుఁ బ్రేమ
వార్తలు గాలిలోఁ బంపినావు,
ఏమిసేయవు తలచిన ? ఇంతవాడవు,
"అందని ఫలమ్ముకొఱకయి ఆసచేయు
చిట్టి మఱుగుజ్జు నే"నని చెప్పినావు
విశ్వకవిరాజ ! ఎంతటి వినయమయ్య !

లలిత మృదూపమాన మధు
రమ్ములు విశ్వరసజ్ఞ మానసం
బులు గిలిగింత పెట్టెడు అ
పూర్వకృతుల్ రచియించి, కీర్తిశ
య్యల సుఖనిద్రఁ దేలెడు మ
హాకవి ! మేల్కొనుమా ! కళా ప్రియుల్
తెలుఁగులు నేఁడొసంగెడు నమ్ర
తి ప్రసవాంజలి స్వీకరింపుమా !

(భారతి, డిసెంబర్ 1958)



# కాంతి చక్రాలు

రాణికిఁ బేదరాలికిని రంగులసానికి నేకరీతిగా
నాణెముగూర్చి, యైదువతనమ్మిడఁజాలు మహోర్షసంస్కృతి
ప్రాణములివ్వి, గాజులు, సువర్ణమణిస్థగితమ్ము, లెల్లపూఁ
బోణులు రండు కై కొనుఁ, దపూర్వములే, నవ కాంతి
చక్రముల్.

సీతమ్మముంజేయి చెందమ్మిమొగ్గకుఁ
గింజల్కముల నతికించినాడ,
తరుణవిద్యార్థినీ కరశాఖికాశిఖల్
వంచి, క్రొంజివురాకులుంచినాడ,
తెరమీది చిత్రాంగిమెఱుఁగుఁగై తీవెలు
నిమిరి, పూజొంపముల్ నింపినాడ,
కార్మికసుందరి కరకార్ముకమునకు
గజ్జెల శింజిని కట్టినాడ,

చిఱునగవె పరిచయముగఁ జిగురుబోండ్ల
కరములు గ్రహింపఁగల కళాపరిణతుంత !
కాచకంకణ విక్రయక్రయచణుంద !
కాంతివలయోజ్జ్వలద్భుజార్గళయుతుంత !

ప్రోగించున్ రతనాలవీణియలు మీ ముంజేతులల్లాడుచో,
సాగించున్ నిరతమ్ము మన్మథ ధనుర్జ్యా టంకృతుల్ ప్రోల్లసత్
రాగమ్ముల్ మొలకెత్త మీ ప్రియుల చిత్తక్షోణిః సమ్మోహన
శ్రీగేహమ్ములు వీనినొక్కపరి సంసేవించి, చూడందగున్.

మెరుగుమీగడతోడి పెరుగుచిల్కోడి కాపు
కన్నెముందు నటించు కవ్వమునకు,
సిరులిచ్చు వరిపంటతఱుగు మాలెతల గు
ప్పిళులక్రేళ్ళుఱుకు లవిత్రములకు,

కమ్మని గుత్తివంకాయ తాళింపు "చుం
యన" దించు నిల్లాలియంగుళులకు,
జిలిబిలి ముద్దుపల్కుల ముత్తెములుచెక్కు-
కవయిత్రి జాళువాగంటమునకు,
ఆ పనరదు, రసస్ఫూర్తి అబ్బగలవె
నా మలారములోఁ గొంటెనవ్వు నవ్వు
గాజుల సరాల మధురనిక్వణములేక ?
కళలునేర్చిన కలకంఠకంఠులార !

ఇవి మించుఁదీవెలు నవవధూ మణిబంధ
సంగతి మోహముప్పొంగఁజేయు,
ఇవి యింద్రచాపముల్ యువతీ కరస్పర్శ
సజ్యమ్ములై సుమాస్త్రములఁగురియు,
తరుణ మృణాళవల్లరులివి, దాంపత్య
సరసిలోఁ బ్రేమపుష్పములు పూయు,
నెలవంకలివి, గేహినీమణి ముంజేత
నటియించి శోకాంధ్యపటల మడఁచు,

ఆదిమ సువాసినులనుండి, ఆధునిక సు
హాసినులదాఁక మెప్పులనందుకొన్న
మానసీయ సౌందర్య సామగ్రులివ్వి
తొడిగి, సరిచూచి, మూల్య మ్మొలిదుఁడు పిదప.

పూతపిందెకాలు లేతమామిడికొమ్మ
గాజుమెట్టెలున్న కలికిమిన్న,
నిత్యచైత్రలక్ష్మి నృత్యకేళిశాల
ఆమె కాలు మోపినట్టి నేల.

గాజులొలిచివేసి, గడియారమునుగట్టి
తిరుగు బస్తిపడుచ ! తెలిసికొనుము
శిశిరశీతవాత శిథిలవల్లికవోలె
చిన్నవోయె నీదు చిన్నిచేయి.

"గాజుల బేరము సరిపడు
భోజనమునకే" యటన్న బుధవాక్యమ్ముల్
యోజించి, భూషణమ్ముల
రాజులు, గాజులను గొందు రాజనిభాస్యల్.

(భారతి, ఏప్రిల్ 1958)



# కోడి ముత్తైదువ

జంతుజాలమందు శ్వానమ్మువలె నీవు
పులుఁగుఁగోలమునందు భూజనులకుఁ
గూర్చుదానవగుట కోడి ముత్తైదువా!
సుకవియెదనుఁ నీకు జోటుగలదు.

కోకిలమ్మ పగిది గూడుకట్టనిదాన!
కాకివోలె తిరుగు కాలిదాన!
కేకికరణి వన్నె యీకలు గలదాన!
గుణములున్నదాన! కోడిదాన!

దిబ్బలుత్రవ్వి, పాటుపడి, తిండిగడించి, చరింతు విందులో
నెబ్బరలేదు, నిన్నలఁతిజీవిగ నెంచిననేమి కూటికై

దబ్బఱలాడు సోమదులు ? ఉదాత్తగుణాధ్యము నీ
చరిత్రఁ, బెన్
గబ్బము వ్రాయవచ్చును, జగమ్ములు మెచ్చ, శ్రమైక
జీవినీ !

అడవిలోన స్వేచ్ఛనడయాడు నిను బల్మిఁ
బట్టితెచ్చె నరుఁడు స్వార్థపరుఁడు,
గతముమఱచి నేఁడు పతిసుతుల్ కొల్వఁ, గా
పురముపెట్టినావు పెరటిలోన.

కలికితురాయి క్రొందొగరు కాంతుల నీనుచునుండ,
నాల్గువం
కల విహరించు నీసవతికాంతలు నర్మమృదూక్తులాడ, నీ
వలపులవల్లభుం డిటకె వచ్చెడువాఁడు, నఖాగ్రవిస్ఫుర
ద్బలకలితుండు నీకుఁదగు భర్తగఁ దోచెడి నన్ని
భంగులన్.

కాలికిఁగత్తికట్టి, ధనకాంక్షను బందెముపెట్టి, వైరితో
నాలము సేయఁబంపిన నిజాధిపుకై, తనగుండె రెండుగాఁ
జీలిననైనఁ బట్టును దృజింపఁడు, ప్రాణముతోడ నేలకున్
దూలఁడు పుంజుపేఁడు, అతనితో సరిపచ్చును
కర్ణుఁడొక్కఁడే.

అట్టి అవక్రవిక్రమ గుణాభరణుండగు నట్టి పుంజురా
పట్టిని జెట్టపట్టితివి శాపురె ! నీవు స్వయంవరమ్మునన్
దట్టపుఁగూర్మి నాతనిమెదన్ గిలిగింతలు పెట్టినేర్చి, లో
గుట్టులెఱింగి, కేళికుసికొల్పెద, వెంతటి ప్రౌఢకాంతవో !

ఋతువునెఱింగి, కూర్మిహృదయేశ్వరుడాని, విలాస
భావసం
భృతగతి సంగమించెదవు, వింతగ గర్వముఁదాల్చి,
అండసం
తతిఁ గురియింతువీనరులదావున, వారిశుధాభుజంగిచే
హతమయిపోక నీకునొకపైనను దక్కునె ?
కుక్కుటాంగనా !

విటమినులన్నికూర్చి, మలి వెచ్చ రసాయనమున్
రచించి, ప్ర
స్ఫుటనవపిండజీవికి సుభోజ్యమొనర్చి, యివన్ని చేర్చి, ము
చ్చటగ, సితాండఖాండముగ సల్పినశిల్పి యెవండొకాని కు
క్కుట జనయిత్రి ! నీయుదరగోళములోన, నివాస
ముండెడిన్.

మ్రింగినన్ని గ్రుడ్లు మ్రింగి, తక్కినయవి
వదలెఁ బెంపుఁదండ్రి పొదుగుమనుచు
లెక్కచూచుకొనవు "కిక్కురు" మన వెంత
నమ్మకమ్మొ నీకు నరులమీద !

తిండిలేక, తనువుబెండయ్యె, దిగులుతోఁ
గుమిలి కుమిలి గుండె కొలిమియయ్యె
గ్రుడ్లు వదలిరావు కోడిచూలాల ! నీ
నిరశనవ్రతమ్ము నిరుపమమ్ము !

అండములోని జీవము నవాంకురమై, చిగురై, ప్రసూనమై
పండినదేమొ నీచిరతపఃపరిపాకముచేత నేఁడు, లో
నుండి వినంగవచ్చునదిగో ! శిశురోదన,మింత ముక్కుతో
అండము గండికొట్టి ప్రసవావసరమ్ములు తీర్పఁబూనుమా!

కన్నసుతు, ననూరుఁగావించెఁగశ్యప
బ్రహ్మయంతవానిపత్ని, వినత,
పూర్ణపృథుకములకె పురుడుపోసెదు, నీదు
చంచువెంత బుద్ధిశాలి యౌర !

కొన్ని గులాబిగుత్తులును,కొన్ని నవాంబుజకుట్మలచ్ఛటల్
కొన్ని తమాలపత్రములు కొన్ని పసందగు వెన్నముద్దలున్
కొన్ని శశాంకబింబములు గ్రుడ్డులువెల్వడి, మైవిదిర్చి, నీ
సన్నిధినిల్చినల్పినవి జాలియెలుంగునఁ గాకలీధ్వనుల్.

బాలకుక్కుటములు, బంతులు, ముద్దచే
మంతులనగఁ జుట్టుగంతులిడఁగ,
దర్శనీయవగుదు, తారకాగణముతోఁ
జందమామ భువికి జాఱెననగ.

మంత్రసానివీవె మాతృదేవతవీవె
దయతలిర్పఁబెంచు తండ్రివీవె
అన్నినీవెయైన అమ్మవు, నీప్రేమ
లోతు కొలువ నెవరిచేతనగును ?

ఎక్కడనేని సద్దువినిపించినఁజాలును, నిక్కినిక్కి, న
ల్దిక్కులుచూచి శత్రువనితేల్చి, హతాద్భయ సూచకధ్వనిన్
గ్రక్కునఁబిల్తు, వాటతమకమ్మున దవ్వులనున్న పిల్లలన్
ఱెక్కలదాచుకొందువరరే ! యెటనేర్చితివిట్టి జాగ్రుతుల్.

రక్కసిడేగ, నీ సొగసు రంగుల పిల్లల నాహరింప, నీ
చక్కికివచ్చుటన్ దెలిసి, చంగున నింగికిలేచి, విద్విషత్
ధిక్కరణక్రుధారుధిర దృక్కులతోఁబగతుస నఖమ్ములన్
ముక్కునరక్కి డిగ్గెదవుభూమికి, గెల్చిన ఝాన్సిరాణివై.

నీకు నీయనుంగు నిసువులకున్ దప్ప
పరులకెఱుఁగరాని బాసలోన
మూగసైగలోన, ముద్దుగా బిడ్డలఁ
బిలుతువీవు, హితవు పలికెదీవు.

ఆకలితోఁ గుమారచరణాయుధముల్ నినుఁజుట్టుముట్ట, నే
యాకునొ పుర్వునో పొదివి, యప్పుడె గుజ్జనగూడుగా, బగా
పాకముగా రచించి, సరిపాళ్ళుగఁబంచెద, విట్లు బిడ్డలన్
సాకుట నిన్నుఁజూచి మనుజబ్రువులందఱు నేర్వగావలెఁ.



"ఎందుకు మేపగావలయు ఈకలు వచ్చిన మిమ్ము, పొందు స్వ
చ్ఛందు" లటంచు నందనుల జాలి వహింపక, పాఱద్రోలె, దీ
వించలిధర్మమర్మముగ్రహింపమిచేతగదా, నరుల్, వృథా
బంధములన్ దగుల్కొనుట, పండితపుత్రులు శుంఠ లౌటయున్.

నిన్ను "పలావు" చేసి, రమణీయముగా భుజియించి, త్రేన్చు భీ
మన్నలు, నిద్రపోవుగురవన్నలు మేల్కొని, లేశమేని, నీ
సున్నితమైన ప్రేముడియు శూరతయున్ బుతుబద్ధరాగభో
గోన్నతియున్ గ్రహించునెడ, ఉర్వి సుభిక్షముగా వెలుంగదే?



# వస్త్రశిల్పి

కదురు ముఖాన, నీయనుఁగుఁగాంత నిరంతర సూత్ర
దుగ్ధముల్
పిదుకుచునుండఁగా, పడుగుపేకలు పేరిచి, రంగులద్ది, నీ
బ్రదుకునె మేల్పసిండి వలిపమ్ముగనేసిన వస్త్రశిల్పి ! ఎ
య్యది వెల నీమహాకృతికి ? ఆర్ద్రహృదంచలి యొందు
తప్పినన్.

కామినీజనముల కటిపర్వతములపై
వ్రేలు సంధ్యా మేఘమాలికలును,
మదవతీవక్షోజ మదచక్రయుగము, బం
ధించి మించెడు బిగికంచుకములు,
పాండితీ శౌండీర్యభరనమ్ర కవిభుజ
స్కంధాలమెఱయు దుశ్శాలువలును,
నవభారతాధ్యక్షభవన శృంగమ్ముపై
నిక్కిన మువ్వన్నె టెక్కెయమును,

నీవు కైసేయు తెలినూలు తీవెతుదలఁ
బొదలి, విరిసిన దిరిసెన పూలుకావె
సభ్యమానవ మానరక్షావ్రతాఢ్య !
కళలగిజిగాఁడ ! చేనేత చెలిమికాఁడ !

శరదభ్రశకలముల్ సాక్షాత్కరించును
దూది పింజలు నీవు దూయునపుడు,
ముదురు వెన్నెలపాలు పిదికినట్లనిపించు
తెలిదారములు సాగఁదీయునపుడు,
పలువన్నెపూల శాద్వలము కండ్లకుఁగట్టు
మగ్గాన చీరను మలచునపుడు,
ఇంద్రచాపముదించి యిమిడించినటులుండు
అంచులపై రంగు లద్దునపుడు,

ఉంచె చేకొన్న శిల్పి కాన్పించునెదుట
నీవు తంత్రమ్ము చెంగటనిలిచినపుడు
నీదు కెంగేలి వ్రేళులనిగ్గుసోకి
నూలు పోగులు రతనాల మాలలగును.

వానలో వలిపట్టి వణకు వృద్ధునిఁజూచి,
ఉత్తరీయముఁజించి యిత్తువీవు,
ప్రజలకై ప్రాణాలు బలియిచ్చిన మహాత్మ
మెడను ఖద్దరు మాల ముడిచెదీవు,
గంగిరెద్దులవాని సంగీతమును మెచ్చి
అంగినిఁదీసి, యొసంగుదీవు,
చిన్నారిమఱదలి సిగ్గు భారముదింప
జిలుగుపయ్యెంట సృష్టింతువీవు,

కరుణతో, భక్తితో, కళానిరతితోడ
ప్రేమతో సర్వజనుల సేవింతువీవు,
నిన్ను దయజూచువాడు కన్పింపఁడొకఁడు
నిత్యము శ్రమించువాఁడ ! చేనేత సఖుఁడ !

అగ్గిపెట్టెలోన అణఁగిన చీని చీ
నాంబరములు నేసితంటతొల్లి !
నేఁడు మాత్రమేమినేయవా ? " ఢక్కా " ప
సందుమల్లు, మెచ్చు సరసులుండ.

ప్రాణములులేని యంత్రాల పనినిమెచ్చి
జీవయంత్రము నినుపేదఁజేతురకట !
కాగితపుఁబూలపై వ్రాలు కందిరీగ
పద్మగంధమ్ము మెచ్చునే పద్మశాలి !

నేయరా ! తమ్ముఁడా ! నెఱపట్టుపుట్టాలు
వడకరా ! పనివాఁడ ! వన్నె చిన్నెల నూలు.
సాటిడు నీకళాసంపదకుఁదలవంప
పట్టుపురుగులుమెచ్చి పారితోషికమంప
కదురులో కిన్నెరలు కదలి ఆలాపింప
మగ్గాన బింగిరులు మద్దెలలు మ్రోగింప
తెగిన పోగులు మించుఁదీగెలై పైకెగసి
మబ్బుచాటునదాగి మాటి మాటికి నవ్వ ॥

గాలిదేలెడుకోక నీలియాకాశమై
మిణుకు చుక్కలతోడ మిలమిలా మెఱసెరా !
అరఁగట్టిన చీర అవామసీమమై
అలరుగుత్తులతోడ అందాలు చిందెరా !
భారతాంబరము సొంపారు చాందినిఁజేసి
కలయఁబ్రాకింపరా కనకాంబరశ్రేణి ॥

పగలు రాతిరులనే పడుగుపేకలుచేసి
సాంధ్యరాగమ్మనే సరిగంచులుగ దిద్ది
ఆరు ఋతువుల నిగ్గులందులో జతచేర్చి
కాలమ్మనే దివ్యచేలమ్ము చేయరా ॥

మిల్లు వస్త్రాల పైమెఱుఁగుమెచ్చేడు దొరలు
నీ బ్రదుకుగుడిసెపై నిప్పులను విసరినా
వెలువఁబోకుము అంత్యవిజయమ్ము నీదెరా
చెదరిపోయిన లేతహృదయ తంతులజేర్చి
సమకూర్పరా విశ్వ సౌహార్ద వసనమ్ము ॥



# రేడియో

అబ్బురమున్ ఘటించుభవదంగవిలాసముమెచ్చి, నేను నీ
గుబ్బలుదాక, నీమెయి గగుర్పొడిచెన్ దరహాసకాంతి పె
ల్లుబ్బెను నీ కనీనికల, నొక్కనిమేషము మూగదాన వై
సిబ్బితిఁద్రోసి,ముచ్చటలుచెప్పెదవెవ్వతెవీవు, జవ్వనీ ।

పలుకుచుందువు ముద్దుపలుకు లొక్కపుడు నా
స్వాంతమ్మునకు గిలిగింతలిడుచు,
పాటపాడెద వొక్కపరి, కలకాకలీ
ధ్వనులు నాలో రసధునులునింప,

శాంతిసందేశముల్ చదివెద వొకమాఱు
    డగ్గఱి, నేఁజెవి యొగ్గి వినఁగ,
ప్రణయలేఖార్థముల్ భాషింతువొకసారి
    హృదయ వీణాతంత్రి కదలిమ్రోగ,
కొదమరాచిల్కవో ? గండు కోకిలమవా ?
పావురమ్మవా ? నలువతేజీవా నీవు ?
ఎఱుకపడదయ్యెనాకు, నిన్నేమి పేరఁ
బిలువమందువె " రేడియో " వలపులాడి !

కైలాసవాసి, మాగారాబు ముత్తవ్వ
    వేలుపై నీలీలవెలసెనేమొ ?
నెఱజాణ, మా చిన్ని మఱదలుపిల్ల, నీ
    సన్నిధిలో నక్కియున్నదేమొ ?
చిటి తాళములుమ్రోయ నటియించు పాత్రాని
    జియ్యరు నీ బొజ్జఁజేరెనేమొ ?

# రేడియో

అబ్బురమున్ ఘటించుభవదంగవిలాసముమెచ్చి, నేను నీ
గుబ్బలుదాక, నీమెయి గగుర్పొడిచెన్ దరహాసకాంతి పె
ల్లుబ్బెను నీ కనీనికల, నొక్కనిమేషము మూగవానవై
సిబ్బితిఁద్రోసి,ముచ్చటలుచెప్పెదవెవ్వతెవీవు, జవ్వనీ ।

పలుకుచుందువు ముద్దుపలుకు లొక్కవుడు నా
స్వాంతమ్మునకు గిలిగింతలిడుచు,
పాటపాడెద వొక్కపరి, కలకాకలీ
ధ్వనులు నాలో రసధునులునింప,





శాంతిసందేశముల్ చదివెద వొకమాఱు
    దగ్గఱి, నేఁజెవి యొగ్గి వినఁగ,
ప్రణయలేఖార్థముల్ భాషింతువొకసారి
    హృదయ వీణాతంత్రి కదలిమ్రోగ,
కొందమరాచిల్కవో ? గండు కోకిలమవొ ?
పావురమ్మవొ ? నలువతేజీవొ నీవు ?
ఎఱుకపడదయ్యెనాకు, నిన్నేమి పేరఁ
బిలువమందువె " రేడియో " వలపులాడి !

కైలాసవాసి, మాగారాబు ముత్తవ్వ
    వేల్పుపై నీలీలవెలసెనేమొ ?
నెఱజాణ, మా చిన్ని మఱదలుపిల్ల, నీ
    సన్నిధిలో నక్కియున్నదేమొ ?
చిటి తాళములుమ్రోయ నటియించు పాతాని
    జియ్యరు నీ బొజ్జఁజేరెనేమొ ?



ఆవల గదిలోని అమ్మలక్కలగోష్ఠి
చందమ్మ! నీచెవి కందునేమొ ?
కానిచో నిన్ని కమ్మని కతలు, చతుర
వాక్కులును, భక్తిగీతాలు, బావిచెంత
ముచ్చటలు నీకడన్ వినవచ్చు టెట్లు ?
అద్భుత మహత్త్వములరాణి ? అభ్రవాణి !

మీదఁజూడనేమొ మిలమిలమెఱపులు
తెఱచిచూడ రాగితీగలుండు
రాగితీగకెవఁడు రాగాలునేర్పె, నీ
విధమదేమొ నాకు వింతగూర్చు.

మేఘాల నర్తించు మెఱపుకన్నెలమేని
తళుకు నీ నయనాల దాచినారు,

నందనోద్యానమండన కల్పతరుశాఖ
చెక్కి, నీతనువు సృష్టించినారు,
నారదమౌని వీణాతంత్రికలసౌరు
కరగించి, హృదయమేర్పఱచినారు,
" మార్కొనీ " విజ్ఞాని మస్తిష్కమందలి
పొరలన్ని నీలోనఁబొదిగినారు,
కావుననె అట్టి జిగిచూపు, కలికిరూపు
ముట్టినంతనె రాగాలు మొలచుకూర్పు,
విశ్వవార్తలు, క్షణములో వినుచునేర్పు
కలిగెనీకు, వరాల రాగాలపెట్టె !

" స్పుట్నికు " లోనెక్కి భూప్రదక్షిణ సేయు
శ్వాన వధూటి భౌ భౌ రవమ్ము
అంబరగతుడైన " అమెరికా " బాల చం
ద్రుని నును " పియానో " స్వనమ్ము

అణుశతఘ్నుల భీషణార్భటుల్ చంద్రబిం
    బమున రేపెడు ప్రతిధ్వానములును,
కుజగోళవాసులు కోపించి, యపుడప్పు
    ధరణిపై విసరు వాక్ఛరగణమ్ము,
కదలికడుపున, మబ్బులనడుమ, భాట
సారు లార్తిమై చేయు దీనారవములు
నిమిషమాత్రాన మాకు నందింపఁగలవు
విస్మయముగ, అశరీర విశ్వవాణి !

సంజవేళ షికారుసాగగా "పార్కు" లో
    అయ్యరు గొంతుతో ఆలపింతువు,
అటపీడి, "హోటలు" కరుగ, "ఆస్ప్రో" మందు
    గుణముపై సంగీత గోష్ఠినేతువు,
అచ్చోటువిడి, రచ్చయరుగు చేరంబోవ
    'బావగారూ !' యని పలుకరింతువు,

అందుండి, నడివీధినడుగుపెట్టగ, నాటి
సరకుల ధరలెల్లఁ జదువుచుందువు,
ఎందుఁ బోయిన నీవుంట యెఱిగి, నేను
నివ్వెఱం పడుచుండ, విన్పింతు వీవు
పెద్ద జడివాన కురియు నీప్రొద్దటంచు
భయముతో నప్పు డింటికిఁ బరుగులిడుదు.

(డిసెంబరు. 1957)



# కవికోకిల నిర్యాణము

కాలకిరాతుఁడెక్కిడిన కర్కశబాణముచే గతాసుఁడై
కూలెనెయింతలోన, కవికోకిల "దువ్వూరి" ! చిన్న
పోయె, రా
గాలపనమ్ములేక మహితాంధ్రకళా తరుణాగ్రశాఖ, నా
జాలియెడందలో,సయిపఁజాలను దుర్భరమైన యీవ్యథన్.

తెగిపోయినదినేఁడు తెనుఁగు శారద చేతి
  వీణలో నొక మంజు విమల తంత్రి,
ఆగిపోయినది నేఁడాంధ్రుల హృదయాలు
  పులకింపఁజేయు కోయిల స్వరంబు,
నిలిచిపోయినది కోమల సస్యరాజిపై
  విహరించు మధుర కవిత్వధార,

మాయమైనది నేఁడు మాతృభాషాయోష
సిగమీఁద శోభిల్లు చిగురుఁదొడవు,
సింహపురిమండలోద్యాన సీమనిలిచి
రసమయానంద గీతికారవము సలుపు
ఘనుని నినుఁ గోలుపోయిన కారణమున,
కవికృషీవల ! యీలోటు కడచు టెట్లు !

నీ "పానశాల"లో నిత్యమమ్మడు వోవు
సుకవితాసవమెల్లఁ జుఱ్ఱులాడి,
నీ "కృషీవలుఁడు" పండించి రాసులువోయు
స్వాదుఫలమ్ముల చవులెఱింగి,
"వనకుమారిక" ముగ్ధవచన ధోరణిలోన
హాయిగా దేహంబు లాదమఱచి,
ప్రతి కావ్యకర్త మర్మములంటఁగల నీదు
వ్యాసచమత్కృతుల్ వల్లెవేసి,

అతులితానందమందిన యాంధ్రజాతి
యశ్రువులు రాల్చుచున్నదీయదనునందు,
దెసలు వెలిఁగించు నీయశో దీపకళిక
తెలుఁగువాణికి, తిలకమై నిలుచుఁగాక !

కలము హలమ్ముగా సమధిక ప్రతిభావిభవమ్మె జోడుగి
త్తలుగ, నవాంధ్రవాఙ్మయపదమ్ములుసాగొనరించి, దివ్యకా
వ్యలతలునాటి, పెంచి, ఫలవంతముజేసిన కర్షకుండ ! నీ
పొలమదినేడు బీడువడిపోయెఁగదయ్య కళావిహీనమై !

"పారసి"కన్న మాతెలుఁగుభాష మహామధురమ్మటంచు,
సొం
పారసి"ఉమ్రఖయ్యము"రుబాయతుతత్త్వయుదాలిచేతి ద్రా
క్షారసపాత్రనింపి, సరసాళికి దోయిటఁగ్రుమ్మరించినా
వీ రసపానమందుఁగయిపెక్కిన దెల్లరసజ్ఞకోటికిన్

పోయితివా మమున్ విడిచిపోయితివా కవికోకిలంబ ! నీ
కాయువునూఱువత్సరములప్పుడెనిండినవా ? భవద్యశః
కాయమొకండెమాకునిఁకఁగన్నులఁగట్టుఁబ్రపంచమందు;క
ట్టా ! ఉదయించునే తరతరాలకు అట్టి కవిత్వమాధురుల్ !

అదనునెఱింగి సస్యములకన్నముఁదెచ్చు మహాపినాకినీ
నదివలె, నీమనోజ్ఞ కవనంబు తళుక్కునఁదోచి, సమ్మద
ప్రదమగుచుండు; పెద్ద జడి పట్టని తొల్కరిజల్లు కైవడిన్
హృదయమునుండిపొంగి ప్రవహించునుసర్వరసజ్ఞభోగ్యమై

ఎన్నికగన్న గొప్పకవివే యయినన్ ఫలభారనమ్రమై
యున్నరసాలవృక్షమటులొప్పెడు నీ వినయస్వభావమే
అన్నిటికంటె ఉన్నతపదాఢ్యతగూర్చినదయ్యనీకు; నిన్
సన్నుతిసేయ,నీయలఁతి,శక్తుఁడె? దువ్వరివంశరత్నమా !

(13-9-1947)



# బాపూజీకి బాష్పాంజలి

( బాపూజీ హత్యావార్తవిని )

నిఖిల మతములు తంత్రులై నిక్వణింప
విశ్వమానవ సౌహార్దవీణమీటి,
సత్యగానమ్ము వినిపించు సాధుఋషిని
హత్యకావించెనట ఒక హైందవుండు !

సాగిలి మ్రొక్కి లేచెనఁట ! జాగయిపోయిన దేలనేఁడు, మీ
యాగమనంబటంచుఁ ప్రియమాడినవాఁడఁట !
చే "రివాల్వరు" న్
లాగి యురమ్ముపైగుఱిగ నాలుగుమాఱులు ప్రేల్చెనంట! ఆ
హా ! గడిదేఱినట్టిపని, హంతకుఁడెంత శిలాంతరంగుఁడో!

గొల్లుమన్నదికదా ! ''ఢిల్లీ'' పురంబంత
"బిర్లా" గృహముతల్పు బీటవాఱ,
వలవలయేడ్చుచుఁ బలుకలేఁడయ్యెగా
"జహ్వారులాల్" గుండె జాఱిపోవ,
గుక్కత్రిప్పక వెక్కఁ గ్రక్కెఁగా యీవార్త
ప్రతి "రేడియో" గొంతు బావురనఁగ
అశ్రువుల్ రాల్చెఁగా అఖిలమానవజాతి
ప్రత్యంగుళమునేల పదునుగాఁగ
పట్టపగటియందు ప్రార్థనసభముందు
చిచ్చురవ్వ గుండెఁజీల్చివైవ
వెలికిఁజిమ్మ నెత్రువెల్లువతో నీవు
ఓ మహాత్మ ! నేలకొఱగినంత.

'హా ! రామా !' యని నీవు కూలఁబడు దృశ్యంబున్, విలోకించుచున్
నీరైపోయెను నిష్ఠురాశ్మములు, కన్నీరేఱులైపాఱె, హా

హాహారావమ్ములు మిన్నుముట్టెనుగదయ్యా !.. మానవత్వానికే
ఘోరంబైనకళంకమిద్దియనుచున్ ఘోషించె నల్దిక్కులున్.

అమృతముఁజిల్కుఆపలుకులా పసిపాపతనమ్ము, ఆముఖా
బ్జము, చిఱునవ్వువెన్నెల, ప్రశాంతవిలోకనకాంతి, సీమసిం
హముల, కహింస నేర్పెనుగదా ! ఒక హైందవుముందు, నిన్ని, వ్య
ర్థములయిపోయెనా ! విధివిధానమునేమనవచ్చు, బాపుజీ !

అస్తమించినది నేఁడానేతుహిమశైల
దేదీప్యమానమౌ దివ్యతార !
భగ్గుమన్నదినేఁడు భారత జనయిత్రి
కనిపెంచుకొన్న బంగారుపంట !
బెడిసి, గల్లునక్రిందఁబడినదుర్వీకాంత
కలికిపాపటమీఁది కనకభూష,

మూగవోయినది భూభువనభర్తకరాన
నినదించు శాంతిమాణిక్యవీణ,
మనుజకోటికి మకుటాయమానుఁడవయి,
దేశమున నవ్యచైతన్య దీపమిడిన
పుణ్యు నినుఁ జేతులారఁ గోల్పోవుకతన,
పూర్ణరాజర్షి ! యీలోటు పూడ్చు టెట్లు ?

స్వేచ్ఛాదుకూలంబు చిన్నబిడ్డలకిచ్చి
మొలఁదాల్చితివి నీవు ముదుకపంచె,
అధికారదండంబు నసహాయులకొసంగి
ఊఁతగొంటివి నీవు చేతికఱ్ఱ,
ఆనందపాయసమందఱకును బంచి
త్రావించితివి నీవు కటికిపస్తు,
అరుణదుర్గపు మార్గ మనుచరులకుఁజూపి
కోరుకొంటివి నీవు పూరియిల్లు,

అట్టి త్యాగమూర్తి, నాత్మబంధుని నిన్ను,
కడలిదాఁటి, ఓడఁగాల్చినట్లు
ఖూనిచేసి, పాపుకోరాని పాపమ్ము
పులుముకొనియె భరతభూమి యిపుడు.

రాజవు కావు నీవు, పలు రాజులు నీ చరణాల దాపునన్
బూజలొనర్చినార, లసిఁబూనినయోధుఁడ వీవుకావు, ఘో
రాజిని నీకుమించిన పరాక్రమవంతుఁడులేఁడు, చిత్రమై
రాజిలు నీచరిత్రకు జరామరణంబులులేవు బాపుజీ!

కలదొలేదో యిట్టి వెలలేని వజ్రంబు
హిందూసతీ గర్భకందరమున,
అలవడునో లేదొ ఆమహత్తర శక్తి
భావి భారతి స్తన్యపానమందు
జనియించునో లేదొ జరుగనున్నయుగాల
హిందుముస్లిములకు నేకసఖుఁడు,

అవతరించునొ లేదొ అనద్వైత తపియించు
మమునేలు జనకుండు మఱియొకండు,
కట్టుకొందుము వీరకంకణమునేఁడె
నీ సదాశయఫలము పండించుకొఱకు,
పరమసాధ్వి "కస్తూరిబా" ప్రక్కనుండ
దివినిగొలువుండి, ఆశీర్వదింపుమయ్య !

పూచెనాయెపుడైన, పుష్పమిట్టిది ప్రాచ్య
విజ్ఞానసంస్కారవృక్షశిఖరి,
దొరకెనా యిట్టి క్రొమ్మెఱుఁగుముత్యము మున్ను
కాలవాహిని తరంగములనడుమ,
పుట్టెనా యిటువంటి పురుషోత్తముఁడు, పూర్వ
కాలాన, భూమాత కాన్పులోన,
కన్నారె, శిశువట్టు లన్నమ్మపైనల్గి
కార్యమ్ముసాధించుఘనునిమున్ను,

అని జగమ్ములు నినుఁగొనియాడఁజూచి
సదమలానందబాష్పముల్ జార్చినాము,
నీదునెత్తుటఁదడిసిన నేలఁజూచి
కటకటా ! వేఁడికన్నీరు కార్చినాము.

ఏసుక్రీస్తును నిన్నునేక ధా భావించి
 యూరోపియనులెంత యూరడిలిరొ ?
అభినవగౌతముం డవతరించెనటంచుఁ
 బూర్వఖండంబెంత మురిసికొనెనొ ?
గోపాలుఁడేపుట్టె గుజరాతులోనని
 హైందవులెంత యానందపడిరొ ?
ఉపవాసముండి మమ్ముద్ధరించెనటంచు
 ముస్లిములెంత సమ్మోదపడిరొ ?
అన్నియాసలు, అడియాసలై చనంగ
సిలువనెక్కిన క్రీస్తును చేరఁదలఁచి
బోయబలిగొన్న కృష్ణుని పొందగోరి
యిహమువిడనాడి బాపుజీ ! యేగినావ ?

వర్షించినవి పూలవాన పీఠరముపై
"రాయల్" విమానాలు రవముసెలంగ,
వెడలివచ్చినది నీవెంట "ఘూర్కా" దండు
"బైనెట్ల" తో డెనల్ ప్రక్కకాదుగ,
బరువులాగిరి ఢిల్లిప్రభు వర్యులే నిన్నుఁ
దీర్చిన మోటారు తేరు కదల,
వెన్నంటివచ్చిరి వేల లక్షల ప్రజల్
కన్నీట రాజమార్గంబుతడియ,
ఇన్ని చేసి మాత్రమేమిఫలమ్ము ? నిన్
దిరిగితెచ్చుకొనుట జరుగదయ్యె,
బ్రద్దలైన అమృత భాండమ్ముదొరకునా
శకలములకుఁ బూజసలిపినంత ?

యమునతీరాన గుంపులై కుములుప్రజల
వేడి కన్నీటి యూటలవెల్లువలకు
ఆరిపోక, గంధపుఁజెక్కలారగించి
గోఘృతముఁద్రావి నాల్కలుగోయుచున్న

మంటలో నిన్ను గుప్పెడుమసియొనర్చి
అఖిలనేతను వలకాటి కప్పఁజెప్పి
చిన్నవోయిన "న్యూఢిల్లి" తెన్నుఁజూడ
కాళ్లరావింటివంకకుఁ గన్నతండ్రి !

బలిగొనినావుగా ! భరతభాగ్యవిధాతనె, నీకుదెందమే
కలుగదు నాథురాము! లయకాలభయంకరమైన కార్యమున్
సలిపిన నీకు దండనలుచాలవు, భావిచరిత్రకారుఁడే
కలుషితమైన నీ చరిత కాటుకతో లిఖియించు దుర్మతీ !

(30-1-1948)



## గ్రుడ్డికొంగ

చలనంబించుకలేక, యీ విమలకాసారంబులో, మౌనివై
జలమధ్యమ్మున నొంటికాలిపయి నిష్ఠాలగ్ననేత్రాలతో
నలఘుస్ఫూర్తిఁదపంబొనర్చెదవు, నీ యాకాంక్షితంబేమొ, కొం
గలరేడా! సెలవియ్యవయ్య, మదికిన్ గౌతూహలంబయ్యెడిన్.

రాగము, భోగమున్ వదలి, బ్రహ్మపదాప్తికినై తపించు స
ద్భాగవతోత్తముండవని, భక్తి ప్రపత్తులతోడ మీనముల్
వేగమ చేరవచ్చె, కను విప్పవు, నీపదపంకజార్చనో
ద్యోగులఁబల్కరింపవు, బకోత్తమ! ఎంతటిధ్యాననిష్ఠయో!

ఎపుడుతదేకదీక్షమెయి నెండకుగాలికినోర్చి, నీటిలో
జపమొనరించుచున్న బకసత్తమ! నీ దినచర్యఁగాంచి, నీ
కపరిమితాభిమానమున నంజలిపట్టక, లోకులెల్ల, దు
ష్కపటి దురాత్మకుండని, యెగాదిగ నిందయొనర్తురేటికో!

అరరె! కన్నుమూసి తెలిచులోపల గండు
మీనునొకటిఁబట్టి మ్రింగినావు,
ఏమెఱుంగనటు నటింతువు, నిను "గ్రుడ్డి
కొంగ" యన్నవారు గ్రుడ్డివారు.

మెఱుఁగులొలయు నీట మెలఁగుబేడిసమీల,
ఆదమఱవఁజేసి, ఆరగింపఁ
బొంచియున్న నీదు వంచన, నెన్నాళ్ల
మఱుగు పఱచఁగలవు మాయలాఁడ!

కలరు నిన్నుమించుఘనులు మా సంఘాన,
వారితోడ పోటిపడకుమెపుడు,
మడుగులోని చేపబుడుతలతో, నరి
పెట్టుకొనుము, బ్రతుకునెట్టుకొనుము.



# హేమము

నిక్కిచూచెడు ధరణీధరమ్ముల శిరో
　　గ్రములకు మల్లుపాగాలు చుట్టి,
తలలూచు ఆరామ తరులతాకుంజ ప
　　త్రములపైఁ గర్పూరరజము చల్లి,
సిగ్గుతోఁగంపించు చేమంతి విరుల ముం
　　గురులపై ముత్యాల సరులునిల్పి,
అల్లన విహరించు పిల్లతెమ్మెరలకుఁ
　　దనువునిండారఁ జందనముపూసి,
గడ్డకట్టిన పూర్ణేందుకాంతులనగ
పాలమున్నీటి నురుగులపంక్తులనగ
మంచువరదలు విశ్వమ్మునుంచియెత్తి,
సృష్టికొక వింతశోభ కల్పించె నేఁడు.

సాలెగూళులను ముత్యాలపందిళ్లుగా
మార్చెడు మంచుపై మమత నాకు,
వెన్నెలపాలపైఁబేరు మీగడవంటి
కమ్మని హిమముపైఁ గాంక్షనాకు,
పసిపాప చిఱునవ్వుపగిది భాసించెడు,
స్వచ్ఛనీహారమిష్టమ్ము నాకు,
ధవళేక్షణాస్నిగ్ధ దంతకాంతులఁగ్రాలు
హిమశకలములు భోజ్యములు నాకు,
తరుణినునుమోవి కండచక్కెరలు కలిపి,
ప్రియులు హిమమారగించుట ప్రియమునాకు
మానవుల వర్ణతారతమ్యమ్ము మాపి
సమమొనర్చెడి హిమము పూజ్యమ్మునాకు.

మంచు, నభోవిటంకమునమబ్బులమాటున, చందమామయై
మించెడుమంచు, మర్త్యులకు మృత్యువు దూరము సేయు
మంచు, ప్రా
పంచిక సృష్టికాద్యమయి భాసిలుమంచు, సుధారసమ్ము వ
ర్షించెడుమంచు, మౌళినిధరింపుఁడు దీనిని, ప్రాజ్ఞశేఖరుల్.

హిమవృష్టిలేకున్న విమలభాగీరథీ
నదికి నైతము జీవనమ్ములేదు,
హిమశృంగములులేక రమణీయ భరత వ
ర్షమునకు శత్రునిర్భయతలేదు,
హిమజలమ్ములు త్రావరేని గ్రీష్మాతప
సంతప్తులకు దాహశాంతిలేదు,
హిమములో పదునుసేయింపనిచో విష
క్రిముల వధించు శస్త్రములులేవు
హిమములేకున్న చలి జనియింపఁబోదు
చలియె లేకున్న వెచ్చనికలలులేవు
కలలు లేనట్టిచోట సత్కళలులేవు
కళలువెలుగని బ్రదుకు నిష్ఫలముగాదె.

హిమకరుని అమృతవర్షము
హిమాంబువుల చల్లదనము, హిమశైల శిరో
రమణీయ దృశ్య, మిన్నియు
హిమమహిమములని యెఱుంగుడెల్ల రసజ్ఞుల్.

(ఆకాశవాణి సౌజన్యంతో)
21-12-1958

## ధూమవేణి

గుండె పూదండగా గ్రుచ్చి ప్రేయసిజడన్
దురుమ నువ్విళ్లూరు నూత్నప్రియుఁడు,
చిరకాలమునకు వచ్చెడు భర్తకై, నవ్వు
కన్నులలో దాచుకొన్న సాధ్వి,
సీమలోఁ జదివి విచ్చేయు పుత్రునికి హా
ర్దాశ్రుమాలలు కట్టు నను(గుజనని,
అతిలోక విజయుఁడై యరుదెంచు ఘనునకు
జేజేలు కాన్కదెచ్చిన జనమ్ము
చెవులు విప్పి, నీయందెలరవళివినగ
గడియ యొక్కయుగమ్ముగాఁ గడపువారు
అస, యడియాస పేయక యరుగుదెమ్ము
ప్రేమహృదయసంధాయినీ! ధూమవేణి!

పగలు రేయి యనక బహుదూరదేశముల్
చుట్టి తిరిగి, అలసి సొలసి, మాదు
పురముఁజేరవచ్చు పొగబండ్లరాణి! వే
వేగ రమ్ము! నీకు స్వాగతమ్ము.

భుగభుగ యెగయు క్రొంబొగలు మేఘమ్ములై
 గగనభాగమ్మెల్లఁ గ్రమ్ముకొనగ,
తళతళ నుదుటిపై వెలుఁగువెల్లువ దివ్వె
 హర ఫాలనేత్రమై తుఱఁగలింప,
ధనధనదొరలెడు ఘనచక్రములు చల
 ద్విష్ణు చక్రమ్ములై విక్రమింప,
కణకణమండెడు గండునిప్పుల కొల్మి
 జ్వాలదగ్నిపర్వతభ్రాంతిఁ గొలుప,
గిరులు భేదించి, ఝరులు లంఘించివచ్చు
గమనవేగోద్ధతికి భూమి కంపమొంద,
ఉగ్రకాళికవై ముందుకుఱికెదమ్మ
భద్రకాళికవై, యాగి, వరములిమ్మ.

కాళులరుగంగ దేశదేశాలు తిరిగి
పొగలువదలుచువచ్చు నీ పొలుపుఁజూడ
జ్ఞప్తివచ్చు, పొలానఁ గష్టమ్ముచేసి,
చుట్టగాల్చుచు నిలుసేరునట్టిరైతు.

వేడిగారెలు, జిలేబీ, లడ్డు పనిలేదు
   భుజియింప రక్కసిబొగ్గుచాలు,
బ్రాంది విస్కీలు, షర్బత్తు లక్కఱలేదు
   త్రావఁగా నిర్మలోదకము చాలు,
పలువన్నె రత్నకంబళములాశింపవు
   కాలూన, ఇనుపపట్టాలె చాలు,
నెలఱాల చంద్రశాలలు కాంక్షసేయవు
   నిలువఁగా చదునైననేలచాలు
పరమయోగివోలె బ్రదుకుసాగింతువు
పరుగులిడెదు తీఱుపాటులేక,
నీ చరిత్ర మాకు నిత్యసేవామృత
పాత్ర, పుణ్యతీర్థయాత్రసూవె.

పయనించెదవు పురీ పరిసరమ్ముల, సిగ్గు
   బరువుతో, పెండ్లికూతురువిధాన,
సాగిపోదువు మహోద్వేగాన సమతల
   ప్రాంత సీమల ప్రౌఢకాంతవోలె,

అడుగులో నడుగిడి నడతువు కొండనె
త్తాలపై నిండుచూలాలులోలె,
దాటిపోదువు దుర్గమాటవీభూములు
లాస్యమాడుచు చెంచులక్ష్మివోలె,
నీదు రాకగోరి నీదారి పొడుగున
పాంథులొందు విరహబాధచూచి
చేరవచ్చి హృదినిజేర్చి కొంపోదువు
రంగులీను పైటకొంగుకదల.

జెట్టివోలె, కొండచిలువపోలిక, కొండ
బిలములందు దూరి వెడలు నిన్ను
వింతజంతువనుచు వేటాడఁజూతురు
అడవిలోని కోయపడుచుదొరలు.

ఉక్కుచెక్కడమ్మ ముక్కుమొగంబెల్ల
బుగ్గలోనిదెల్ల బొగ్గు, నీరు,
బొగ్గునమలు నీకు బుసకొట్టి పర్వెత్తు
జీవమెవ్వడిచ్చెఁ జెప్పఁగలవె.

ముసలిమీనములీల, ముసురుపట్టిననాడు
పెనువానవెల్లువ మునిగియాది,
ముదికమఠమ్మట్లు, మూపుచిప్పలమీద
ఉరుగిరి భారమ్ములోర్మిమోసి,
ఆదిఘోణివిధాన, అడ్డువచ్చినవారి
ముట్టెతోఁబడఁగొట్టి నెట్టివైచి,
నరసింహమటు, బలోద్ధురగతి, ధూమకే
సరములు కదల గర్జనముసల్పి,
బొజ్జ సర్వజనాళికి నెజ్జచేసి,
తలచినప్పుడు నిలిచి యార్తులనుబ్రోచు
చక్రధారిణివగు నీకు, చక్రధారి
కేమి భేదమ్ముగలదె సుశ్యామలాంగి!

తెక్కలువాల్చె కంబములు, రింగున గంటలుమ్రోగె, దూరమం
దెక్కడొ నీదు కూత వినిపింప, జనమ్ములు మూట ముల్లెయల్
ప్రక్కలుచుట్టి మీదికెగఁబ్రాకిరి, మాపటివేళ, తల్లికై
దిక్కులుచూచి, తెక్కలువిదిర్చెడు పిచ్చికపిల్లలోయనన్.

ఆగినావా లేదా మూగిరిచుట్టు దో
స్సారయుతులు బాటసారులపుడె,
లోనివారి వెలికిరానీరు, తముఁదాము
నెట్టుకొనుటలోన పట్టువిడరు.

వారి వీరిమధ్య ఘోర సంగ్రామమ్ము
జరిగెఁదుట్టదుదకు శాంతియొదవె.
దిగినవారు దిగఁగ మిగిలినవారితోఁ
జేరుకొనిరి నూత్నవీరవరులు.

తలుపులు బ్రద్దలు కొట్టుచు
బలగర్వముచేత వలసవచ్చిన జనులన్
దిలకించి, ప్రాతకాపులు
పలికిరి శాపోక్తులిట్లు పలురీతులుగన్.

కాచుకోరా ! అలెగ్జాండరూ ! యనుచుఁ బై
కుటికి నాఁడొక పురుషోత్తముండు,
ఓరి ! గోరీ ! నీకు గోరికట్టెదనిదే
వీక్షింపుమనె నొక్క పృథ్వీరాజు,

సీమదొరా ! నీవు చిట్లించెదనటంచు
లంఘించె టిప్పుసుల్తానొకండు,
ఢల్హౌసి ! నీ చావు దగ్గతైనని ముష్టి
చూపించె తాంతియాతోపి యొకడు
పథికజనులిట్లు ప్రాచీన భరతవీర
పాత్రలు ధరించి పటురసబంధురముగ
ఆడి చూపించి రొక నిమేషార్ధమందు
మూడు వేలేండ్ల భారతభూమి చరిత.

బండి కదలువేళ భరతవాక్యముపల్కి,
ఆట కట్టిపెట్టి, బాటసారు,
లెవరిచోట వారలెక్కి భద్రమ్ముగాఁ
గుదురుకొనిరి సంధికుదిరెననగ.

అడిగినంతటనె మూడడుగులు చోటిచ్చి
బలిచక్రవర్తియై పరగె నొకఁడు,
ప్రక్కవానికి రొట్టెముక్క కోసి యొసంగి
శిబిమహారాజుగాఁ జెలఁగె నొకఁడు,

తనచోటు ప్రత్యర్థియనక, దత్తమొనర్చి
దానకర్ణుండయి తనరె నొకఁడు,
పేకాట కితరులు పిలిచినంతనె పోయి
తానె ధర్మజుఁడని తలఁచె నొకఁడు,
"అతిథి పూజకుఁ బుట్టినిల్లార్యభూమి,
తెలియ, సఖ్యమ్ము సాప్తపదీన" మనుచు
వివిధ సిద్ధాంతములు వల్లె వేసిరపుడు
ప్రాత తగవులు మఱచిన పాంథజనులు.

నిదురపోక, అన్యుల నిదురపోనీయక
రోదించు బిడ్డల బాదువారు,
వెంటఁదెచ్చిన పిండివంటల రుచి, తోడి
చెలులకు వర్ణించి చెప్పువారు,
జీరంగులటు చెవిఁజేరి పైసాలని
కొసరు భిక్షకులను కసరువారు,
ఎదుటనే కూర్చున్న యెలనాగ నెటులైనఁ
బలుకరింపగ పోటీ పడెదువారు,

రైలుపెట్టెయె తమ మందిరముగఁదలచి
పురిటియిల్లు, భోజనశాల, ముంగిలియును
పడకగదియును, అందె యేర్పఱచుకొనుచు
సలుపసాగిరి వింతసంసారయాత్ర.

చట్టాలు చెల్లవు సన్యాసులకటంచు
యోగమ్ముఁబట్టు బైరాగియొకఁడు,
"టిక్కెట్టు" కొనకయే ఠీవిగా పడకపై
దొంగనిద్దురపోవు దొరయొకండు,
ఒకడు కొన్నట్టి పత్రికలాగి, చదివి, వ్యా
ఖ్యానముల్ విసరునాయకుడొకండు,
"ఐస్క్రీము" చూపించి ఆబాలవృద్ధమ్ము
నోరూరఁజేయు వ్యాపారియొకఁడు
అన్నిచోటులఁ దాముగా అవతరించి
అన్నిసీటులు తమవిగా ఆక్రమింప
ఒకరిపైనొక్కరెక్కి కూర్చుండి, యచట
వేడ్క చూచుచున్నారు వివిధజనులు.

ఒఱగుదిండులు పట్టుపఱుపులై కాని భో
గులుతేని యద్దాల చలువగదులు,
మిణుగురుంబుర్వుల మెఱుపుతో గిజిగాని
గూడులై ప్రియులకుఁ గూర్చుగదులు,
నల్లిబాలెంతలు పిల్లలఁబెంచు బ
ల్లలతోడ జనములఁ బిలుచు గదులు,
భూమిడిగ్గిన జీర్ణపుష్పకంబట్టుల
నెందఱెక్కినను తావిచ్చుగదులు
కలసి, యేర్పడు నీ దీర్ఘకాయమొప్పు
చిలిమిలేములు భోగరోగములు ఇరుగు
పొరుగుగ వసించు భారతభూమివోలె
సంఘరూపిణీ ! జీవితసత్యవాణీ !

ఆప్తబంధుహితులై యాత్రికులుగ నాదు
బ్రదుకురైలుబండి పయనమయ్యె
ధర్మపథమునుండి తలగనీయక, గమ్య
సీమ చేర్పఁగదవె ధూమవేణీ !

# నిద్ర

పాల్ద్రావు చిన్నారిపాపనై నేనేడ్వ
    తల్లిరీతిగ జోలతట్టెనెవతె
వలపుపొంగుల కోడెవయసులో నేనుండ
    ప్రియురాలివలె కౌగిలించె నెవతె
వలిపట్టి గడగడవణకెడు నామీద
    కాశ్మీరశాలువగప్పెనెవతె
మిడియెండలో డస్సి నడచున న్నూడల
    పెనుమఱ్ఱి నీడయై పిలిచెనెవతె
స్పర్శమాత్రాన పారవశ్యముఁగూర్చి
దివ్యలోకాలలో నన్ను ద్రిప్పెనెవతె
ఆమె నిద్రాకుమారి, మా ప్రేమబంధ
మెప్పటి ఋణానుబంధమో యెఱుగరాదు.

పరునియిల్లొక్కింత పచ్చనయ్యెనో లేదొ
నీకంటిలోపల నిప్పురేగె
ఎదురింటికాంతపయ్యెద జారినంత, నీ
యెదలోన జెట్టులు మెదలసాగె,
ధనలక్ష్మి నినుఁజూచి కనుగీటెనోలేదొ
అనిమిషత్వమ్మె నీ కంకురించె
అధికారపీఠికనధివసించితొ లేదొ
కట్టియే పాముయి కఱవవచ్చె
పట్టుపరుపులందు పవళించి, కన్నులు
మూసినంత మనసుమూయఁగలవె
నిదురదేవిచెలిమి నీకెట్లులభియించు
చిత్తశాంతిలేని చిన్నవాడ!

చింతలేనిమనసు సింహాసనమ్మెగా
నిదురరాణి యేలు నిఖిలజగము,
ముండ్లపొదలు పూలచెండ్లౌను, యుగములు
గడియలౌను, ఆమె కరుణకలుగ,

విరుల పానుపులును వింజామరములు లం
చమ్ము పెట్టి ప్రభుని సరకుగొనదు
స్వేదజలము నేలఁ జిందిన శ్రమజీవి
కౌగిలింత కామె కరగిపోవు.

పవళించినది భ్రువవల్లికమ్మ దె చూడు
ఏటిబత్తెము నొక్క పూట మెక్క,
గుఱువెట్టుచుండె నీ కుంభకర్ణుడు చూడు
శతకోటి మత్కుణక్షతికినోర్చి,
పొరలుచుండెను త్రాగుబోతుసోమరి వీడు
పగలు రేయను భేదభావముడిగి,
పడియుండెమృతుడట్లు బడుగుభిక్షువితండు
మురికికాలువగంధమును సహించి,
ప్రకృతిగారడీని ప్రథమచిత్రము నిద్ర
దీని వింతశక్తి తెలియలేక
నిదురమునిగినారు నిఖిలశాస్త్రజ్ఞులే,
తక్కుజనుల మాట తలపనేల?

పగలెల్ల ఘోషించి పాథోధి నిద్రించె
నీలిపయ్యెద మోమునిండఁగప్పి
రాజుకౌగిటను రేరాణి నిద్దురవోయె
పలుచని వెన్నెల వలువగట్టి
కాలునిల్వని కొంటెగాలియు మెయివాల్చె
గుబురుటాకుల చెట్టుకొమ్మలెక్కి
బువ్వకై తిరిగిన పులుగులు మెయివాల్చె
కూనలు ప్రక్కలో కుదురుకొనగ
నింగియును నేలయును గూడ నిదురవోయె
చుక్కలచ్చెరుపాటున చూచుచుండ
నిదురవోయినప్రకృతి రాణించెనిప్పుడు
కదలికయెలేని నవదీపకళికవోలె.

నిద్రించుశేషాద్రినిలయునిఁగని, "సుప్ర
భాతమ్ము" పాడెను భక్తకోటి
యోగనిద్రాముద్ర నున్న శంభునిఁజూచి
మరుడు విల్లెక్కుడ మఱచిపోయె

నిద్రించు ప్రేయసి నెమ్మోము వర్ణింప
కవికలంబు పొంగి గంతులిడియె
నిద్రలో నవ్వేడు నిసువునక్కునఁ జేర్చి
బాలెంతరాలు సంబరము పడియె
నిద్రపోవు కడలి నిలువుటద్దములోన
ద్యుమణి మబ్బు కురులు దువ్వుకొనియె
నిదుర నూత్న శక్తులుదయింపఁజేయును
నిదుర సృష్టికందమెదుగఁజేయు.

నిదురలేకున్నచో నెగడునే సకలామ
యములఁగుదుర్చు సిద్ధౌషధమ్ము
నిదురలేకున్నచో బ్రదుకునే నిఱుపేద
మశకమత్కుణబాధ మఱచిపోయి
నిదురలేకున్న పండించునే పంట క
ర్షకుడు దైనికకష్టజలధిదాటి
నిదురలేకున్న రాణించునే మేధావి
అణుగర్భమున రహస్యమ్ములరసి

నిదురలేక కలపె మదికి ఇంపగుకలల్
కలలులేక లలితకళలుగలపె
కళలులేనిచోటఁగలదె ఆనంద, మా
నందరహితజగము నరులకేల?

నిదుర పన్నీటికోనేట మజ్జనమాడ
బడలిన నెమ్మేను పరిమళించు
నిదుర రేయెండయై హృదినినిండగ, దీర్ఘ
చింతాతమస్సులు చెదరిపోవు
నిద్రవసంతమై నివ్వటిల్లినవేళ
ఆత్మకోకిల గానమాలపించు
గాఢనిద్రా నిర్వికల్పసమాధిలో
జీవుడు బ్రహ్మైక్యసిద్ధిఁబొందు
నిదురచెలియలికట్టయై నిలిచినపుడె
వేదనాబ్ధితరంగాలు వెనుకకొదుగు
నిదుర రంగులతెరయయి కదలినపుడె
రక్తికట్టును జీవితరంగసీమ.

ప్రకృతివైద్యుచేతి పరమసంజీవని,
ప్రతిదినమ్ము నరుల మృతులఁజేసి
మరలబ్రదుకఁజేయు మంత్రబలము నిద్ర,
నిదురకేదిసాటి నిఖిలభువిని ?

గాఢనిద్ర తల్లికౌగిట, చెలిచెంత
కపటనిద్ర, వార్ధకమ్మునందు
యోగనిద్ర, చివరిదొక పెద్దనిద్ర, యీ
బ్రదుకు మొదలు తుదయు నిదురసూవె.

కనులుతెఱచి నరుడు కనలేని తప్పులు
కనులుమూసినపుడు కాననేర్చు,
నరునికనులుమూయు పరశక్తి నిద్దుర
అట్టి నిదురకెప్పుడంజలింతు.

::::❀::::

## ఓ మహాకవి కాళిదాసా!

ఓ మహాకవి కాళిదాసా !
ఓ రసోజ్జ్వల వాగ్విలాసా !
ఏది ధారానగరవాటిక
ఏది భోజునిరత్నపీఠిక
నీ సృజించిన కావ్యవీణానిక్వణములేక ?

ప్రణయరాగము పరిమళించిన
పార్వతీదృఙ్మాలికలలో
మరులుచెందిన శంభుడేడీ
మరునిఁగాల్చిన రుద్రుడేడీ
నీ కళాదర్పణములో బింబితుడు కాకున్న ?

విరహియక్షుని జాలిగాథకు
వీనులొగ్గిన మేఘుడెక్కడ
మేఘుడేగిన త్రోవలో, న
ర్తించినట్టి మయూరమెక్కడ
నీ మనోహర కల్పనాపై చిత్రిలేకున్న ?

కూతునంపెడువేళ కణ్వుడు
కుమిలియేడ్చిన కరుణఘట్టము
పీడఁజాలని చెలిని వీడిన
విరుల తీగల మూగవేదన
ఎటులకంటివి ? ఎటులవింటివి ? ఎఱుగఁ జెపుమయ్యా !

దివ్యభామిని, ఊర్వశిని భువి
దించి తెచ్చితి వెంతజాణవు !
ప్రణయరోగి, పురూరవ ప్రభు
బ్రదుకు నిల్పితి వెంతప్రోఢవు !
గంటముననె, రసౌషధమ్ములు కలపగలవోహో !

దీపశిఖవలె, ఇందుమతి అం
దియలు మ్రోగగ ముందుసాగగ
మోహపరవశులైన రాజుల
మొలక నవ్వులు మూతివిరుపులు
చోద్యముగ వర్ణించినావే చూచివచ్చితివా ?

(స్రవంతి, డిసెంబరు 1958)



# వడగండ్లు

వచ్చెను వచ్చెను వడగండ్లూ !....మీ
పసిపిల్లలకివి చిఱుతిండ్లూ !
పడుచుకుఱ్ఱలకు పువుచెండ్లూ, మీ
బట్టపుత్తైలకు కడగండ్లూ !

తొలకరిజవ్వని వలపుకాన్కలివి
గడియదాటితే కరగిపోవునూ
దొరలకైననూ దొరకవుమరలా !

ఏఱంబోవగా జాఱిపోవునూ
చేయి దగిలితే జి  జిల్లుమను
నోరుచేరి నీరూరగఁజేయును !

విరహజ్వరమున పొరలేవారికి
పథ్యములేనీ పసందుమాత్రలు
పైకమీయకే కైకొండూ !

శీతసమీరుని చేతుఁలజిక్కిన
వేసగి మొగిళుల పెనగులాటలో
తునిగిపడెనహో ముత్యాలూ !

మేఘకుమారుడు మెఱపుకన్నియకు
తాళిగట్టు శుభవేళను జలజల
నేలరాలినవి తలఁబ్రాలూ !

గర్జించెడు తొలికాఱుమబ్బులే
కొమ్ముచేన్గులటు కుమ్ముకొనంగా
ప్రేలిపడెనురా దంతాలూ !

నీలియంబరపు మేలికట్టులో
వ్రేలుచుండి పెనుగాలి దెబ్బలకు
రాలిపడిన పీ రసగుండ్లూ !

విదలగ గాచిన చదలుతోటలో
కొంటె తెమ్మెరలు కొమ్మలూపగా
పలపలరాలిన పసగలపండ్లూ !

విమానమున వినువీధి నెగురుతూ
సరదాకై దొరసానులు విసరగ
చిటపటరాలిన మిఠాయి ఉండలు !



## కడలికావరము

ఎందుకే కడలి ! నీకింత కావరము ?
ఆపవే కొంత నీ అలల తీవరము ?

నీపేరు విని రత్ననిలయుండవని నమ్మి
పేరాసతోవచ్చి తీరాన నిల్చుంటి
నత్తగుల్లలు తెచ్చి నాముందు చల్లెదవు
వట్టి నురుగులు విసరికొట్టి పర్వెత్తెదవు
ఉప్పునీరములు పైనుమిసి తెగనవ్వెదవు
యాచకులతోడ పరియాచకములా నీకు ?

ప్రతిదినము వాహినీ పరిచారికలు తెచ్చు
వనమూలికా స్వాదువారిపూరమ్ములు
చవులు చెడిపోయె నీ లవణాధరము సోకి,
ఒడలెల్ల పెనుసుడులు, ఎడదలో ఘనశిలలు
కలిగి మిడిసెడు నీకు కనికరంబెటులుండు ?

మ్రొక్కువారికి వరములెక్కడొసఁగితి వీవు
ధిక్కారమున మున్ను దేవ దైత్యులు నిన్ను
త్రచ్చినప్పుడె కదా యిచ్చితివి అమృతమ్ము
లోకబాంధవుడు నీ లోభమ్ముఁజూచి, నీ
జీవనమ్ములు పీల్చి, ఆవిరిగ తగమార్చి
సన్మార్గులగు ఘనుల చలువ మాకందించె
పిసినిగొట్టులసొమ్ము కొసకిట్టులేయౌను!

నిండుజాబిలి తూర్పుకొండపై వికసింప
పొంగు కెరటాలతో నింగికెగసెదవేల ?
కోలుపోయిన సుధాకోశమనుకొంటివా ?
ఎంతయెగసిన కుప్పిగంతులేకద నీవి
అందుకోలేవులే అమృతాంశుబింబమును!

వెల్లువలు జగమెల్ల కొల్లగొట్టినదెల్ల
కొనితెచ్చి నీ నోటఁగ్రుక్కుచున్ననుగూడ

బొజ్జలేచినజాడ పొడకట్ట దిదియేమి !
పరుల సొమ్ముంత వేగిరమె జీర్ణించునా ?

నిఱుపేద నీయింట చరణముంచినఁజాలు
సొరచేపకోరలనుజూపి అడలించెదవు,
అణుశతఘ్నులు ప్రేల్చి రణమహోన్మాదులు
నీ యొడలిమీద విషవాయువులు చిమ్మినా
పల్లెత్తుమాటనవు, బలవంతులనికదా !



# అజంతా శిల్పి

ఓ అజంతా దివ్యశిల్పీ!
ఓ మహోన్నత విశ్వశిల్పీ!

సృష్టిలో సౌందర్యమంతా
చిత్తమందలి రాగమంతా
మూగబొమ్మల భంగిమలలో
సోగకన్నుల యొప్పిదములో
కుప్పవోసిన నీదు రంగులకుంచె నేమందూ!

రంగులా అవికావు గీర్వా
ణాంగనల జవ్వనపు పొంగులు
ఇలకు డిగ్గి ద్రవించి నిల్చిన
యింద్రచాప వినూత్నభంగులు
తూల చెక్కిళులందు ఏగతి రంగరించితివో!

నీవు మెట్టిన కొండలన్నీ
నిద్రమేల్కొని లేచిచూచెను
నీవు తాకిన ముదిమిబండలు
నిండుజవ్వనమున హసించెను
జడములకు గిలిగింతపెట్టెడు జాణవీవౌరా!

నిష్ఠురాశ్మముచేతగొని, నవ
నీతమట్టుల సాగదీసితి
పూవుగా, పువుబోణిగా, విరి
తీవగా కల్పించి చూపితి,
వీ అపూర్వ మహేంద్రజాలము నెచటనేర్చితివీ?

కటికిఱాలను జీల్చి అచ్చర
కలికిమిన్నల వెలికిదీసిన
ప్రతిమలను కులికించి, అభినయ
గతులునేర్పిన నీదు పోగర
మంత్రదండముకానిచో ఆ మహిమలెక్కడివీ?

ఉలిని కవ్వముచేసి యీ గిరి
తలమహాంబుధి నీవు చిలుకగ
శిలలె అలలై అప్సరసలను
శీర్షములపై మోసితెచ్చెను
నవకళామృతముద్భవించెను భువనభోగ్యమ్మై!

ఎందుచూచిన బుద్ధదేవుని
మందహాసమె గోచరించును
ఎచట పిలిచిన కరుణదేవుని
హృదయవీణయె బదులుపలుకును
శిలలుకావివి, శాక్యమౌనిసజీవరూపములే!

ముకుళితాక్షుండైన బుద్ధుని
భ్రూలతలె గిరిరూపుదాల్చెను
కరుణదేవుని హృదయమే యిటు
కరగి సెలయేరై స్రవించెను
ప్రకృతికాదది, బోధిసత్త్వుని పరమరూపమ్మే!

గతశతాబ్దుల కళారోచులు
కన్నులకు మిఱుమిట్లు గొల్పెను
సుమలకందని ఊహాలేవో
ఎడదలో పరవళ్లు త్రొక్కెను
నీ అజంతాగుహలముంగిట నిలుచుకొన్నంత!

ఎవ్వడుతొలిచిన శిలాగుహలివి
ఎపుడు మొలిచిన కళాలతలివి
ఇప్పుడే ఉలిమొనలు కదలిన
చప్పుడులు విన్పించునేలా!
ఇపుడె పూచినయట్లు వాసనలెగయుగానేలా!



# ఊదరా!

ఊదరా! నీ నాగసరమూ!
నాద బ్రహ్మానంద నవరసాకరమూ!

నీ గానమాధురికి నిలువెల్ల పులకింప
బుట్టలో వసియించి బుసలుకొట్టే నాగు
పసిబిడ్డవలె లేచి పడగవిప్పెను చూడు!

కదలిరచ్చేదువేళ కవ్వంపుత్రాడుగా
విసమంతయును గ్రక్కి ముసలిదై పోయిన
పాపరాజును నీవు పట్టితెచ్చితివేమొ?

ఏ పుట్టలోనిదో యీకోడెనాగన్న
కసిపట్టి యెవ్వరిని కాటువేయగరాదు
గణపయ్య యెలుకను కఱువబోవనినాగు
కొమరయ్య నెమలితో కూర్మినెఱపెడునాగు
కైలాసమునగాక, కలదె వేఱొకచోట!

భుజగభూషణుముందు మోడివేసినవేళ
మెచ్చి మెడలో సొమ్ములిచ్చినాడా నీకు ?
నాగతల్పునియెదుట నాగస్వరముపట్ట
ఆదిశేషుడె నిన్ను అనుసరించెనొ యేమొ ?

అల్లనాగులచవితి కెల్ల పేరంటాండ్రు
పుట్టకోమల పాలుపోసి పిల్చినవేళ
కలికమునకొకపాము వెలికి రాదాయెరా
ఎట్లు నీ బుట్టలోకెక్కెనో తెల్పరా ?



# పుడమి తల్లి

ఎంత చల్లనిదానవే పుడమితల్లి!
ఎనలేని జాలిగుండెల పాలవెల్లి!

కడుపులో లోహాగ్ని కడలిలో బడబాగ్ని
ఒడలెల్ల దావాగ్ని ఉడుకులెత్తించినా
తరగిపోనీవు నీ తరళదరహాసాలు
మల్లెలు గుబాళించు మధుర మధుమాసాలు!

జలధులే నీలాల జలతారు చీరలుగ
పండి యొఱగిన చేలు పసిఁడిమేల్ముసుగుగా
ఘనతరంగిణులెల్ల కంఠహారములుగా
ముస్తాబుచేసికొను మురిపాలరాణివే!

పన్నీటితో మబ్బుకన్నెలభిషేకింప
గాడ్పుచేడెలు మేన గంధాలుపూయగా

కుసుమితద్రుమరాజి మిసిమిపుప్పొడిచల్ల
ఋతువు ఋతువున అలంకృతుల భాసింతువే।

తలిపివెన్నెల పాలనురుగులో నీరార్చి
వేయికరములవాని వేడితో తడియొత్తి
బిడ్డలను లాలించు ప్రేమైకరాశివే
ప్రాయముడుగని పచ్చిబాలెంతరాలవే।



## పువ్వులు

పువ్వులు పువ్వులు పువ్వులు !
తీవెజవ్వనుల తియ్యని నవ్వులు
వేడిమివీడిన వెలుతురు రవ్వలు !

చెట్టుల జుట్టుల చేనిగట్టులా
పచ్చికపట్టుల ప్రపంచమంతా
ఎక్కడచూచిన పక్కన నవ్వే
మల్లెలు మొల్లలు మందారమ్ములు
పొన్నలు పొగడలు సన్నజాజులూ !

దేవునిమెడలో కోమలిజడలో
భక్తులరక్తుల పలుకరించుచూ
అళుల రొదలతో చలించుచువ్వలు !

గాడ్పుకుజ్జులకు కమ్మనితావులు
తేటికొాదమలకు తేనియసోనలు
విందులుగుడిపే వెన్నెల గిన్నెలు !

ప్రణయదంపతుల భావనేత్రముల
క్రమ్మిన చీకటి చిమ్మివైవగా
వసంతుడెత్తిన వన్నెల దివ్వెలు !

మూలఁబఁరుండిన ముసలికి సైతం
వణకుపోవగా వలపురేగగా
మారుడు రువ్విన తారాచువ్వలు !



# మ్రోయింపరా మురళి!

మ్రోయింపరా మురళి
ఓయి. గోపాలకా!

గున్నమామిడికొమ్మగుబురులో కొలువున్న
గండుకోయిలరాణి కంఠాన శ్రుతిగల్ప!

శిలలపై దుముకాడు సెలయేటి యలలు నీ
కలగీతికకు మృదంగధ్వనుల్ జతచేర్ప!

నీపాట వ్యర్థమని తాపమ్మువలదురా
ప్రకృతి నీ గీతిలో పరవశమ్మయ్యెరా!

మోడులే చిగురించె బీడులే పులకించె
ఫణులు పడగలు విప్పి మణిదీధితులు నింపె!

గిరులు మ్రాన్పడిచూచె తరులెల్ల తలలూపె
బుడుతపవనుడు వెదురుపొదల ఈలలువేసె!

ఆలకదుపులు మేత చాలించి మెడలెత్తి
చెవులు టిక్కించి, నీ చేరువకు వచ్చెరా!



## రామభావము

ఓయి శ్రీరామ ! విశ్వోదాత్త గుణధామ !
పూర్ణమానవతా ప్రఫుల్లమల్లీదామ !

చైత్రనవమీభాను చిత్రాంగుళీస్పర్శ
కాశ్మీరపంకమ్ము కడలుకొనె నల్గడల
తూర్పుముంగిలి స్వర్ణతోరణమ్మై వ్రేలె
నీరాకకై రత్ననీరాజనము పట్టె !

అదె ఉషఃకన్య ఒయ్యారమ్ముగాఁజార్చు
తెలిమంచుతుంపురులఁ దలయంటిపోసికొని
విరులు, కింజల్కంపుకురులు సరిదిద్దుకొని
తలిరురేకులుకట్టి వలచు పుష్పొడులద్ది
గోరువెచ్చని తేనె ధారలాయితపఱచి
నీ కొఱకు మాధవా ! నింగిదారులుచూచె
రావోయి మా హృదయరథమండపమ్మెక్క !



జనని గర్భాశయ జలజాకరమ్ములో
మత్స్యమ్ముగతి నీది మహిమీదనెగిరిపడి
కూర్మమన దోగాడి ఘోణివలె దుముకాడి
నరసింహమటు చేతదొరకినది భేదించి
వామనాకారమున బడికేగి పఠియించి
పరశురాముని వోలె ప్రత్యర్థులకుఁదోచి
బహుళావతారముల బహుకళావేత్తవై
పట్టభద్రతగన్న పరిపూర్ణపూరుషా!

బ్రదుకు కాఱడవిలో భయములేక చరించి
బంగారులేడికై పరుగులెత్తి శ్రమించి,
ఇల్లాలులేని వెత ఉల్లమున భరియించి,
ఆత్మబలసేతువున ఆపదబ్ధినిదాటి
విజయమందినయట్టి వివిధానుభవశాలి!

పదితలల యోచనలబారిబడి బీడైన
పుడమికన్నెను బంది విడిపించి, చేపట్టి
వలపు తొల్కరిలోన పులకింపగాఁజేసి
నాగేటిచాలులో నవభోగధాన్యాలు
గంపకెత్తిన జగత్కర్షకుడ వీవెకా!



# సందేహడోల

గాలిలోఁ దేలాడు కార్మబ్బు చూలాలు
పన్నీటి తుంపురులు ప్రసవించునో
వడగండ్ల పెనుగుండ్లు వర్షించునో ?

తొలిసంజవెలుగులో తలయెత్తు పసిమొగ్గ
వలపునిండిన నవ్వులొలికించునో
తొడిమతెగి ధూళిలో విలపించునో ?

ఉర్వీసాంగత్యాన ఉబ్బిపోయెడుగింజ
మోమెల్ల వికసింప మొలకెత్తునో
క్రిములకాహారమై కృశియించునో ?

గిరిదూకి బిరబిరా పరుగెత్తు సెలయేరు
కడలిఁజేరెడుదాక జీవించునో
వడదాకి నడుమనే మరణించునో ?



## పసికూన

ఎవరో కనివిడిచిన పసికూనా!
ఏమగునో నీ బ్రదుకు జగానా!

ఏ కుంతీసతి లోకనిందకై
కన్నకడుపు నడిగంగను వైచెనొ
ఏమేనక తన ప్రేమఫలమ్మును
కాఱడవులకే కానుక యిచ్చెనొ!

కన్నతల్లి నిను కాదన్నంతనె
ప్రకృతిమాతకే బరువయ్యేదవా!
అడవిచెట్టు నెవడాదరించెనో
కోకిలకెవ్వడు గూడుకట్టెనో
ఆ ప్రభువే నీ కాధారంబిక!

గుక్కత్రిప్పకే కుయ్యిడు నినుఁగని
గిరులే ఝరులై కరగిపోయినవి
తొలిమల తలపై తొంగిచూచి, రవి,
కరసహస్రముల కౌగిలించె నిను!

దారినిబోయెడు తల్లియావు నీ
పెదవులమీదనె పొదుగుచేపినది
వనపక్షులు నీ వాపోవుటవిని
పండ్లు పిదికి చనుబాలు పోసినవి
మెత్తనిపూవుల పొత్తులలోనిడి
శ్రోత్రపేయముగ జోలపాడినవి ;

ఏ రాధాసతి కూరిమిపెంపున
నీ జిగిబుగ్గల నిమురనున్నదో
ఏ సుయోధనుడు హృదయమిత్రుడై
రాజ్యమిచ్చి నిను రాజుగఁజేయునొ
విజయులు శౌరులు వెఱచిపాఱగా
కర్ణునివలె నుతిఁగాంచెదవేమో ?

ఏ కణ్వుడు నిన్నెత్తిపెంచునో
జింకలతో గోర్వంకలతో నిను
ఆశ్రమభూముల ఆడఁబంపునో,
సాధ్వి శకుంతలచాడ్పున భారత
వీరసింహములఁ బెంచెదవేమో ?



## విజ్ఞాన విహంగం

విజ్ఞానవిహంగ మదే
విజృంభించి యెగసిందీ!
భూలోకం తెక్కలపెను
గాలికి కంపించుతోంది!

మానవ మస్తిష్కమ్ముల
మహాగాధ కుహరాల్లో
విద్యుద్వల్లీ సమిధల
విఱిచితెచ్చి గూడుకట్టి
పరమాణుగణమ్ము పొదిగి
ప్రళయశక్తి సృష్టించిన
విజ్ఞానవిహంగమదే
విజృంభించి యెగసిందీ!

"సహారా" యెడారిలోని
సైకతాలు చిమ్ముతోంది



జ్వాలాముఖిపై " లావా "
జ్వాలలు కబళించుతోంది
మందరమటు సంద్రమెల్ల
మథియించి కుదించుతోంది
కాకోలం పీయూషం
ఏకం కావించుతోంది !

ఉల్కా శకలమ్ములట్టె
ఉఫ్ అని పైకూదివేయు
శూన్యాకాశం వెలుపల
సూర్యుని ఢీకొట్టబోవు
నవగ్రహాల దాపులలో
నరవాసన పసికట్టును !

" స్పుట్నిక్కులు " దానికండ్లు
చుక్కలు దూరంపు టెటులు

చందురులో జింకతోడి
చెలగాటం దానికెపుడు
ఉదజని బాంబులు దానికి
ఒదవిన రక్కసి పిల్లలు
రాకెట్టులు విచ్చుకొన్న
రక్కసి అంపాల గోళ్లు
గోళ్ళమధ్య చిక్కి వేలు
కోట్ల ప్రజాకంఠమ్ములు
శరణని జీమూత వాహ
సంస్మరణం చేస్తున్నవి :



## నవనాగరిక మానవుడు

నవనాగరిక మానవుడను నేను!
నానాశక్తిసమన్వితుడ నేను!

నాలో నిదురిస్తున్నవి కాలకూట భుజంగాలు
కదలిస్తేచాలు, మరి కరుస్తాయి మీదబడి
చేరువకే రాకండి దూరంగా ఉండండి
కోపం తెప్పించకండి అపయిచింతించకండి!

నానా దుష్టమృగాల్లో నేనొకడై ఉన్నప్పుడు
సింహాలను బెదరింపగ శిరోజాలు పెంచినాను
క్రోల్పులితో పందెమొడ్డి కోరమీసముంచినాను
ప్రేయసిచెక్కిళ్లు నేడు గాయపడునో యేమోయని
ప్రేమ తపోదీక్షలోన "ఫ్రెంచికట్టు" చేసినాను!

ఉఱుములకే ఉలికిపడే మెఱుములకే వెఱగుపడే
అమాయికుణ్ణికాను నేను, ఆదినాలు గతించాయి
మేఘాలకు నేనంటే మితిమీరినభయంనేడు
మబ్బులచెవి పట్టిలాగి మాయింటికి కొనివస్తా
జడివానలు కురిపిస్తా చాలంటే నిలిపేస్తా ।

సాయంత్రం షికారుగా చంద్రలోకం వెళుతుంటా
ఎగిరే మెఱపుతీగెతో సిగరెట్టును వెలిగిస్తా
విద్యుత్తును పుట్టిస్తా ఇంటిపనులు చేయిస్తా
"షాకు" తగిలి మరణిస్తే స్వర్గానికి పయనిస్తా ।

ఇనుమునకు మసాలవేసి పెనముమీదవేయిస్తా
ఉక్కును చిక్కుదీసి చక్కని బొమ్మనుచేస్తా
బొమ్మచేత నాయింట్లో కమ్మరిపని చేయిస్తా ।

బంగారంకంటె కాకిబంగారం ప్రీతినాకు
తేనెకంటె నేలలోని నూనెయె ప్రియతరంనాకు



అణువులోని మహాశక్తి నాకళించినానెపుడో
"బాంబు" కడుపులో దానిని భద్రపఱచియుంచాను
"హిరోషిమా"లో మునుపు ప్రయోగించి చూశాను
జనాభా తగ్గుదలకు సదుపాయం కూర్చినాను
తిండీగుడ్డా లేవని దిగులెందుకు మీకింకా
ఆకలిలేకుండేందుకు ఔషధాలు కనిపెట్టాను
చిఱునవ్వును స్టోరుచేసి సీసాల్లో దాచినాను
కోరినపుడు మీరందరు కొనవచ్చును ఖరీదిచ్చి।

ప్రజలందరు శాంతంగా బ్రతకాలనే నేనంటే
ఆందోళనచేసేవారందరికీ మెదడుజబ్బు
తాటిపండ్లరీతి వారి తలపుఱ్ఱెలు విడదీస్తా
ఖరాబైన మెదడులన్ని మరామత్తు గావిస్తా।





ర చ యి త

జ న న ము: 1932.

జన్మస్థలము: ఇనిమెర్ల, కనిగిరి తాలూకా, నెల్లూరుజిల్లా.

విద్యాభ్యాసము: అల్లూరు (నెల్లూరుజిల్లా) రామకృష్ణ ఉన్నత విద్యాలయములో, నెల్లూరు వెంకటగిరి రాజాగారి కళాశాలలో మద్రాసు గిండి ఇంజనీరింగు కళాశాలలో.

ఇతర రచనలు: "నేతాజీ" (పద్యకావ్యము)—1946.
"వివేకానందుడు" (పద్యకావ్యము)—1952.

ఉద్యోగము: కొంతకాలము ఆంధ్రప్రదేశ్ P.W.D.లో జూనియర్ ఇంజనీరు; ప్రస్తుతము హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఇంజనీరింగు ఉపన్యాసకులు.